

# ప్రబుద్ధాంధ్ర


ప్రతిసంచిక రెండణాలు ౬ ౨ సంపాదకుడు

సంవత్సర చందా రూపాయి ౧౦ ఫిబ్రవరి ౧౯౩౭



శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## విరాళములు

సంవత్సర చందాలవల్ల మాత్రమే ప్రబుద్ధాంధ్రను నిర్వహించడం కష్టం. ఈ సంగతి గమనించి ప్రబుద్ధాంధ్ర యెడల ఆదరం వున్న ఔదార్యవంతులు ఉత్సాహవరి మితా లైన విరాళాలు దయచేస్తున్నారు. ఈ నెలలో ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు.

| | |
|---|---|
| ౧ శ్రీ తురగా రామచంద్రరావు పంతులు గారు. ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు, విశాఖపట్నం | ౫—౦—౦ |
| ౨ శ్రీ తెన్నేటి విశ్వనాథంపంతులుగారు ఎం, ఏ, బి. ఎల్. విశాఖపట్నం | ౫—౦—౦ |
| ౩ శ్రీ కంభంపాటి సత్యనారాయణమూర్తి గారు అవిడిగ్రామం | ౫—౦—౦ |
| ౪ ఒక శ్రేయోభిలాషి. బి. ఏ. బి. ఎల్ వకీలు రాజమండ్రి | ౫—౦—౦ |

## ఏజంట్లు కావాలి

ప్రబుద్ధాంధ్ర పత్రిక విడిసంచికలు అమ్మడానికి ఈ క్రింది స్థలాలలో ఏజంట్లు కావాలి. మంచి కమిషను ఇస్తాము.

| | |
|---|---|
| ౧ ఏలూరు | ౧౫ తుని |
| ౨ బెజవాడ | ౧౬ సామర్లకోట |
| ౩ బందరు | ౧౭ బరంపురం |
| ౪ గుడివాడ | ౧౮ పాలకొల్లు |
| ౫ నరసారావుపేట | ౧౯ నరసాపురం |
| ౬ నంద్యాల | ౨౦ అమలాపురం |
| ౭ కర్నూలు | ౨౧ రేపల్లె |
| ౮ కడప | ౨౨ హైదరాబాదు |
| ౯ అనంతపురం | ౨౩ సికిందాబాదు |
| ౧౦ గుంతకల్లు | ౨౪ గూడూరు |
| ౧౧ ఒంగోలు | ౨౫ పెద్దాపురం |
| ౧౨ కావలి | ౨౬ రామచంద్రపురం |
| ౧౩ తిరుపతి | ౨౭ వెంకటగిరి |
| ౧౪ మద్రాసు | |

## విషయసూచిక


| | |
|---|---|
| ౧ బాధ్యతమీద పడీదాకానే (చిన్నకథ) సంపాదకుడు | ౩౭ |
| ౨ ఆంధ్రులు—నాట్యకళ. గరిమెళ్ల సత్యనారాయణ గారు బి.ఏ | ౪౪ |
| ౩ పుష్పస్వాధీన పరుచుకోవలసిన లలితకళ. కళాప్రియుడు | ౫౦ |
| ౪ రఘుపతి వెంకటరత్నంగారు, చింతా దీక్షితులుగారు బి. ఏ, ఎల్. టి | ౫౧ |
| ౫ అపశ్రుతి (ఏకాంకనాటకం). శ్రీ విశ్వనాథకవిరాజుగారు | ౫౩ |
| ౬ షబ్‌నవీన్ (చిన్నకథ). భావరాజు వెంకటకృష్ణారావు గారు బి. ఎ, బి. ఎల్ | ౫౯ |
| (పత్రికలో పొరపాటున ఇది శబ్‌నవీన్ అని పడినది. పాఠకులు షబ్‌నవీన్ అని చదువగోరెదము) | |
| ౭ హిందీవల్ల తెనుక్కు జరుగుతూవున్న అపకారం. (౧ సంపాదకుడు ౨ మున్నంగి శర్మగారు) | ౬౪-౬౭ |
| ౮ వ్యాఖ్యానములు. (పూనికమంచిదే; కాని విషఫలం ఇస్తుంది. ౨ చివరకి.........? ౩ దివంగతులు మునిస్వామినాయడుగారు. ౪ రాయలసీమ—కరువు. ౫ ఇంకా తెలవడం లేదూ? ౬ నాట్యకళ) | ౬౭-౭౦ |
| ౯ ఒకజాబు. ప. కేశవరావుగారు | ౭౦ |
| ౧౦ ఒరిస్సా సరిహద్దులు—జయపురం ఏజన్సీ శ్రీపాద నరసింహమూర్తిగారు బి. ఏ. | ౭౧ |


## కృతజ్ఞాలము

ఈసంచిక ముఖపత్రం మీది చిత్రమును రాసి ప్రబుద్ధాంధ్రకు కళ కూర్చిన శ్రీ అడివి బాపిరాజు పంతులు బి. ఏ. బి. ఎల్ గారికి ఎప్పుడూ కృతజ్ఞులము.

సంపాదకుడు

## ఈ క్రిందిచోట్ల ఏజంట్లు ఉన్నారు

| | |
|---|---|
| ౧ కాకినాడ | ౭ బాపట్ల |
| ౨ పిఠాపురం | ౮ నెల్లూరు |
| ౩ అనకాపల్లి | ౯ చిత్తూరు |
| ౪ విశాఖపట్నం | ౧౦ నిడదవోలు |
| ౫ విజయనగరం | ౧౧ భీమవరం |
| ౬ తెనాలి | ౧౨ గుంటూరు |

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లువారి

# జీవామృతము (రిజిష్టర్డు)

సుప్రసిద్ధమగు యీ బలవర్ధకౌషధమును బలహీనతకు చిక్కిన యెల్లరు సేవింపనగును. ఏ కారణముచేత దేహము నిర్వీర్యత, నిస్సత్తువకు పాలుపడినను యీ జీవామృతము చక్కని దేహమనోబలములను, ఉత్సాహమును, వీర్యపటుత్వమును, ప్రసాదించును.

రెండు సైజులలో దొరకును. పెద్దది రు 3-4-0; చిన్నది రు 1-12-0

# బాలభాస్కర (రిజిష్టర్డు)

బిడ్డల లివర్ & స్ప్లీను జాడ్యములకు అమోఘౌషధము

దీనివాడుక జాడ్యము చేరకుండ కాపాడుట మాత్రమే గాక జాడ్యము ముదిరినను నిస్సంశయమగు గుణమిచ్చి మంచి ఆరోగ్యమును కలిగించును. కెమిస్టు లందరి యొద్దను దొరకును.

వివరములకు

ఆయుర్వేదాశ్రమము

151, గోవిందప్పనాయక వీధి, ఆపాలపెట్టై 287,

మదరాసు

## గ్రంథకర్త సోదరులకు విన్నపం

మనం పుస్తకాలు రాస్తున్నాము; కాని వాటిని ప్రకటించి మనకొక ఋణం యిచ్చి, తామొక ఋణం అనుభవించే ప్రకటనకర్తలు లేరు. అంచేత మనమే మనపుస్తకాలు ప్రకటించుకోవలసి వస్తోంది, అయితే: ప్రతీ గ్రంథకర్తా తగినన్ని పుస్తకాలు ప్రకటించలేక ప్రకటించిన కొద్ది గ్రంథాలకూ ప్రకటన చేసుకోలేక అచ్చుపడ్డ పుస్తకాలన్నీ దాదాపు జాగ్రత్త చేసుకోడం కోసమే యిబ్బంది పడుతున్నాడు. ఈ దురవస్థకేమీ విరుగుడు కనపడడం లేదు. ఇదంతా ఆలోచించి, నేను, నాపుస్తకాలతో పాటు ఇతర్ల పుస్తకాలు కూడా నా పత్రిక ద్వారా ప్రకటన చెయ్యతలుచుకున్నాను. ఇది తమకి కొంత ప్రయోజనం కలిగించవచ్చు. అధునికుల పుస్తకాలన్నీ వొకచోట దొరికితే పుస్తకప్రియులకు వొక్క పోస్టేజీతోను, వొక్క రిజిస్ట్రేషనుతోనూ, వొక్క మనియార్డరు కమిషనుతోను ఎక్కడి కెక్కడికో రాసుకో వలసిన వేరువేరు పుస్తకాలు ఒకచోటనుంచే తెప్పించుకోడానికి అవకాశం వుంటుంది. దీనివల్ల పుస్తకాలు కొనడంలో వారికి మంచి ప్రోత్సాహం కలుగుతుంది. కనక గ్రంథకర్త లయిన సోదరులు ఈ సంగతి గమనించి తమ పబ్లికేషన్సు ఒక్కొక్కటి డజను చొప్పున నాకు పంపితే నేను సరిగా లెక్కలు ఉంచి అమ్మిన తరవాత డబ్బు పంపుతూ వుంటాను. ఇష్టమున్నవారు తమ అభిప్రాయం నాకు తెలియచేయ కోరుతున్నాను.

ఇట్లు

రాజమండ్రి — శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

"ప్రబుద్ధాంధ్ర"




సర్. రఘుపతి వేంకటరత్నం నాయడుగారు

# ప్రబుద్ధాంధ్ర



సంపుటము ౬ రాజమహేంద్రవరము ఫిబ్రవరి ౧౯౩౫ ౨ వ సంచిక

## బాధ్యత మీదపడీదాకానే

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

“దండాలు బాబయ్యా!”

“ఏమిరా?”

“బుల్లిబాబుగారు వస్తున్నారండి”

“ఎంత దూరంలో ఉన్నారూ?”

“తబేలాలో ఉన్నారండి. ఇవాళ గుర్రాన్ని మారుస్తారు బాబయ్యా”

“ఏం?”

“కొత్తగుర్రాలు వచ్చాయి కాదండీ? సొంతంగా తనిఖీచెయ్యవలసిందని మహారాజావారు సెలవిచ్చారండి బుల్లిబాబయ్యగారికి”

“బాగుంది...ఆలస్యం అవుతుందేమో?...మనం అక్కడికే వెడితే?”

“అక్కర్లేదు దేవరా! ఈ పాటికి గుర్రం యెక్కుతారండి”

“సరే అయితే”

“...........గుర్రం అలిసిపోయింది దొరగారూ”

“నేనింకా అలిసిపోలేదురా!”

“చిత్తం చిత్తం, తమరు అలిసిపోవడం అంటూ ఉండాండి?......ఇది కూడా ఆగకపోతే యేలినవారికి పనికివచ్చే గుర్రం ప్రపంచకంలో లేదన్నమాట బాబయ్యా!”

“ధోరణి చూస్తే యిది కొంతవరకూ ఆగేటట్టే ఉందిరా!”

“అయితే మంచిదే కాదండీ?......అసలు మహారాజావారు కొత్తగుర్రాల్ని తమదగ్గిరికి తీసుకువెళ్లమన్నారండి”

“అ-లా-గా?”

“మేమంతా లాభం లేదని మనవిచేసుకున్నామండి. ఏలినవారి తనిఖీకి వాటిలో ఒక్కటీ ఆగదండి”

“బుల్లిబాబు తనిఖీమాత్రం సామాన్యం అనుకున్నావా యేమిటి? ఈగుర్రాన్ని బుల్లిబాబు తప్ప మూడోవాడెవడేనా యెక్కగలిగాడా?”

“అలాగే కానండి దొరగారూ—అదిగో బుల్లిబాబుగారు వచ్చారు”

“.......................”

### ప్రశంస

“ఆర్యా! “ప్రబుద్ధాంధ్ర” ఆరో సంపుటము మొదటి సంచిక చూచి కళ్లు కద్దుకొన్నాను. మీ ఉత్సాహమూ, మీ ఉద్యమమూ దేశభాషాభిమానులు మెచ్చుకోకమానరు. ఒకరి మెప్పు కోరి మీరీపని చేయడము లేదు. మీసంకల్పము మీరు నెరవేర్చుకొంటున్నారు. దేశసేవాపరాయణులు కోరే ప్రతిఫలము సంకల్పసిద్ధి మాత్రమే.

శ్రీమతి సౌ॥ చి॥ కృష్ణకుమారి వ్రాసిన లేఖ చదివి పరమానందము పొందినాను. ఇట్టి విదుషీమణిని కన్న శ్రీ వాళం కృష్ణారావుగారిని అభినందిస్తున్నాను. ఆమె భర్తగారు మిక్కిలి అదృష్టవంతులు గనుకనే ఇట్టి సహధర్మచారిణి లభించినది.

మన పత్రికకు తగిన ధనము దొరకుతుందని నమ్ముతాను................

పర్లాకిమిడి ఇట్లు

౧౪—౧—౩౫ గి. వేం. రామమూర్తి”

"బహుకాలదర్శనం. అదేనా దారి కాపించి పట్టిస్తేనూ"

"తబేలాకే రమ్మని కబురుచేస్తే యేమిటి!"

"క్షమించాలి. ఉత్సాహాన్ని అరికట్టాను"

"కారణం చెబితే మించిపోయింది లేదు. అయిన ఆలస్యం కూడ తీసుకోవాలని గుర్రానికి తెలుసు"

"......................"

"దూరాన ఉండి ఆలస్యం చెయ్యడానికీ, మొదటికి వచ్చాక కూడా జాప్యం చెయ్యడానికీ తేడావుంది"

"అవునవును"

"ఏదేనా రహస్యమా ?"

"కాదు కాదు. అయినా—నీకు నచ్చదు కానీ—నువ్వు రావు కానీ—"

"ఎందుకో—యెక్కడికో రమ్మంటావు. ఎన్నో కారణాలు చూపిస్తావు. అయినా నేను రానని నీకు తెలుసు. ఇంకెందుకూ శ్రమా ?"

"నిజమే; కాని చెప్పకుండా—కోరకుండా ఉండలేక పోతున్నాను. కూడా నువ్వు లేకుండా యెక్కడికెక్కడికో వెళుతూనూ ఉన్నాను, యేమిటేమిటో చేస్తూనూ ఉన్నాను; కాని మనస్సుకి ఉల్లాసం లేదు. నువ్వు దగ్గర లేనిలోటు తుణాతుణానికీ, అడుగడుక్కీ—ప్రతీదాన్లోనూ కనపడుతోంది"

"......................"

"ఈనాడాదినుంచీ నే నెలాంటి అవస్థపడుతున్నానో నువ్వెరగవు. ఊహించేనా తెలుసుకోవు"

"......................"

"నువ్వు నన్ను చేరనివ్వడం లేదు"

"......................"

"నేనంటే నీకు లక్ష్యం లేదు. స్నేహం లేదు. చివరికి దయ—"

"నువ్వంత మాట అనకూడదు. నేను నీభృత్యుణ్ణి"

"ఆభావం నాకే కోశంలోనూ లేదు"

"అయితే నీవిషయంలో నాకెలాంటి భావం ఉందో నీకు తెలవదన్న మాట"

"......................"

"రాజు విషయంలో మంత్రి చూపించే లక్ష్యానికీ, మంత్రియెడల రాజు కనపరిచే లక్ష్యానికీ చాలా వారఉంది"

"......................"

"రాజులకోసం మంత్రులు ప్రాణాలిచ్చేస్తారు; కాని మంత్రులకు రాజు లిచ్చేవి డబ్బూ, ప్రశంసలూనూ"

"......................"

"మంత్రులకోసం రాజులు సకలమూ అర్పించిన సన్నివేశం ప్రపంచంలో యెక్కడా లేదు"

"పనేదో యాదాలాభంగా అన్నమాటకి నువ్వు చాలా యెదయిపోతున్నావు. నాఉద్దేశం తెలుసుకుంటే నీకీ ఉద్రేకం కలక్కపోవును. ప్రజాపాలనం విషయంలో రాజుల బాధ్యత కంటే మంత్రుల బాధ్యత యెక్కువ... కదూ !"

"నిజమే"

"అయితే నువ్వావీధికి వెళ్ళడం బాగుందా!"

"నాస్థితిగతులు గ్రహించి మరీ మాట్లాడు. ఇది మంచా చెడ్డా—"

"అలా కాదు. ఇది లాభమా నష్టమా—"

"సెబాస్ ! అదీ గమనించతగ్గది. నాఉల్లాసం కాస్తా హరించిపోయాక—నామనస్సు అయోమయం అయిపోయాక యిక నేను చేసే దేమిటి ?"

"అలాంటి సందర్భం యేం వచ్చిందీ యిప్పుడూ!"

"అలా అడిగావు, బాగుంది...... నేనిప్పుడు యావతృష్ణతో అస్తవ్యస్త మయిపోతున్నాను. అనుభవం తప్ప దీనికి సాధనం కనపడలేదు. కొంతమట్టుకేనా దీన్ని జయించలేకపోయాను"

"......................"

"దీక్ష పడితే కొంచెమేనా—కొన్ని—రోజులేనా అణచిపెట్టి ఉంచవచ్చు; కాని ముందుముందు—ఒకానొక రసకందాయప్పట్టులో విజృంభించి ఇది అపాయకరం అయిపోతుంది"

"సర్వమూ తెలిసిన నువ్వే—"

"విను......రాజ్యం నీది. రెక్కల్లో సర్వాధికారాల తోటీపాటు సకలబాధ్యతలూ నీవి. అయితే నువ్వు హంసతూలికాతల్పంమీద పరవశుడవై ఉండేటప్పుడు కూడా నేను బుర్ర చించుకుంటూనే ఉండాలి. ఆస్థితి వచ్చాక యిక సుఖమంటే యేమిటి? ఆనందం అంటే యేమిటి? కనక—"

"ఇకచాలు. వెళ్ళు"

"నచ్చిందా?"

"ఇక నిన్నడ్డుపెట్టను"

"తృప్తయిందా?"

"అనవసరంగా ఆలస్యం అయిపోతోంది"

"మారుభావనలో పడిపోయావు నువ్వు. లేకపోతే నీకిది తెలవందా?......ఇది గమనించావా? సుఖం అనుభవించడానికే పుట్టిన నువ్వీ లేతవయస్సులోనే రాజకార్యాల్లో మునిగిపోవడమూ, విషమసంధులు విడమర్చడానికే పుట్టిన నేనిలాగ భోగలాలసతలో పడి యీతాలాడుతూ ఉండడమూ—ఇది గమ్మత్తుగా లేదూ!"

"ఇక నాసెవం లేదు. తెలుసునా!"

"వెడుతున్నా. ఒక్క సంగతి మాత్రం విను. నువ్వు నన్నేలేవాడవు. నీచేతిలో ఒక పనిముట్టుగానే ఉండవలసినవాణ్ణి నేను. కనక యెప్పుడవసరం వస్తే అప్పుడు—ఏక్షణంలో కబురు వస్తే ఆక్షణంలో రెక్కలు కట్టుకు వాల్తాను"

"........................."

"వెంకటపతీ!"

"ఏం సెలవు బాబూ?"

"గోవిందయ్య యేడిరా?"

"మేఘాలమీద యెగిరిపోయారు దేవరా!"

"ఏమి రాతురా!"

"ఫిరంగికి కూడా అందరు బాబూ గోవిందయ్య గారు"

"మనస్సుకో?"

"ఒక్క అడుగు ముందే ఉంటారు ప్రభూ!"

"........................."

౨

రాయజగపతిమహారాజుకి గోవిందయ్య చాకచక్యం పూర్తిగా తెలుసు. "దేశాటనం పండితమిత్రతా చ" అనే సిద్ధాంతం కూడా అతను బాగా యెరుగును. కాని—ఏమయితే యేం? అతగాడికి గోవిందయ్యని గురించి తీరని బెంగపట్టుకుంది.

రాయజగపతికి తిమ్మజగపతి ఒక్కడే కొడుకు. రామయామాత్యుడికి కూడా గోవిందయ్య ఒక్కడే కొడుకు.

తరతరాలనుంచి ఆవంశం ప్రజాపాలనమూ, యీవంశం మంత్రాంగమూ నిర్వహిస్తున్నాయి.

తాను ముసలివాడయిపోతున్నాడు. అయితే, అందుకు విచారం లేదు మహారాజుకి. తిమ్మజగపతికి పట్టాభిషేకం చెయ్యవలసిన రోజు సమీపిస్తోంది. అతనంతు కెప్పుడెప్పుడని యెదురుచూస్తున్నాడు; కాని తిమ్మజగపతి రాజయితే మరి మంత్రి?

ఇది యిలా ఉండగా:

గోవిందయ్య అస్తమానూ వేశ్యావాటికలోనే ఉండడం చూస్తూఉండిన్నీ రామయామాత్యుడేమీ కలగచేసుకోవడం లేదు. చివరికి చీమకుట్టినట్టు కూడా లేదతనికి. ఇదికూడా రాజుకి ఉక్కిరిబిక్కిరి కలిగిస్తోంది.

ఒకనాడు రాజూ మంత్రీ కోటలోపలే ప్రవహరీగోడ దగ్గిరగా పచారు చేస్తున్నారు. అప్పటి కింకా జాము పొద్దు పూర్తిగా లేదు. ఏమిటేమిటో గొడవలు వెళ్ళిపోతున్నాయి. ఉన్నట్టుండగా మహారాజుకి హఠాత్తుగా యీసంగతి తలపుకి వచ్చింది.

"అయితేనూ—గోవిందయ్య సంగతి యేమేనా చూస్తున్నావా?"

"లేదు మహారాజా!"

".........లేదూ?"

"లేదండి"

"మతిపోయిందా యేమిటి నీకు?"

"లేదు మహాప్రభూ!"

“అయితే నాకు పోయిందన్నమాట మతి”

“అదీ లేదు జగత్ప్రభూ!”

“..........................”

“అంత ఆశ్చర్యానికి కారణం నాకు బోధపడడం లేదు ప్రభూ!”

“.........నీకూ గోవిందయ్యకీ యేమేనా మాట పట్టింపులు—”

“నాజన్మలో అలాంటి దౌర్భాగ్యం తటస్థించదు దేవా!”

“..........................”

“ఏలినవారి ఉద్దేశం యేమిటో నాకు అవగాహన కావడం లేదండి”

“నీకొడుకు చెడిపోతున్నాడు—చెడిపోతున్నా డేమిటింకా మెల్లిగా, చెడిపోయాడు”

“లేదు మహారాజా, ఎంతమాత్రమూ లేదు”

[illegible]

“తమతో హాస్యాలా మహాప్రభూ నాకు? నాకొడుకు చెడిపోలేదు. చెడిపోవడమున్నా లేదు. చెడిపోదు కూడానూ. తమకి ఆవిచారం అక్కరలేదు. సకలవిషయాల్లోనూ నాకొడుకి ముందు నేను తీసికట్టుగా ఉన్నాను. నాకడుపు మళ్ళీ ఆయుగంధరుడు అవతరించాడు. ఆచాణక్యప్రజ్ఞ మళ్ళీ ప్రజలు కళ్ళారా చూస్తారు జగత్ప్రభూ!”

“ఇదెక్కడి ధోరణోయ్!”

“ఇందులో యేమీ అజ్ఞానం కానీ, అసత్యం కాని లేదు దేవా!”

“నవ్వు తప్పుదారిలో ఉన్నావు సుమా”

“లేదండి”

“ . ..... ... . ...........”

“ .. ...... . ...........”

“నీకొడుకు తరుచు యెక్కడుంటున్నాడో—అదేనా తెలుసునా నీకు?”

“చిత్తం, వేశ్యావాటికలో ఉంటున్నాడు మహారాజా”

“అది చెడిపోవడం కాదూ?”

“వేశ్యాసంపర్కం నేను సమర్థించను; కాని నాకొడుకు చెడిపోడు మహాప్రభూ!”

“నువ్వేం చెబుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా?”

“ఏలినవారు పరీక్ష చేయించవచ్చు”

“పరీక్షించవచ్చా?”

“తమకి అడ్డేమిటి భూలోకదేవేంద్రా!”

“అయితే ఇవ్వాడే కానిద్దా మావని............ నవ్వు కూడానే ఉండాలిసుమా”

“మహాప్రసాదం”

కనుసన్నల్లోనే మెలగుతూ ఉన్న నౌకర్ని పిలిచి, మహారాజు, “వెళ్లి గోవిందయ్యని నుంచున్నపాళంగా తీసుకురారా” అని ఆజ్ఞాపించి, మంత్రిని వెంటపెట్టుకుని హనుమంతబురుజుమీదికి వెళ్లి కూర్చున్నాడు.

3

దారిపొడూగునా రాజు ఆలోచిస్తూనే ఉన్నాడు. కూచున్న తరవాత కూడా పదినిమిషాల దాకా మాట్లాడలేదు.

“నీధైర్యం యేమిటో కాని—మొత్తానికి నువ్వు తప్పుదారిలో ఉన్నావు. వేశ్యాసహవాసంవల్ల తనుహాని, మానసష్టం—ఒకటేమిటి? నీకొడుకు కూడా నీచాటున ఆపనీ, యీపనీ నిర్వహించడం అవసరమైన రోజు లివి. నాకొడుకు చూశావా కార్యనిర్వహణం యెంత శ్రద్ధగా నేర్చుకుంటున్నాడో?”

“యువరాజావారి ప్రతిభ సామాన్యం కాదు. అయితే నాకొడుకు—నిశితప్రతిభకి అభ్యాసంతో పని ఉండదు మహారాజా”

“..........................”

“కార్యనిర్వహణం నౌకర్ల పని. చెయ్యి తిరగవలసింది వాళ్లకి. స్థితిగతులను పట్టి కార్యాలు నిర్ణయిస్తూ ఉండడమే రాజుకీ మంత్రికీ పని. ఎప్పు డేది యెలా పరిణమిస్తుందో దా న్ననుసరించి కల్పన. దానికి ఒకదారి

తెన్నా—అభూతకల్పనలకి అభ్యాసం యేమిటి జగత్ప్రభూ?''

"స్త్రీలోలుడు—"

"చిత్తం మహారాజా! నాకొడుకు ప్రస్తుతం స్త్రీలోలుడుగా ఉండడం వాస్తవమే; కాని—"

సరిగా యీసమయంలో నౌకరు వచ్చి "గోవిందయ్యగారు వస్తాను వద మన్నారు బాబయ్యా" అని చెప్పాడు.

"నువ్వు వెళ్లాటప్పటి కేంచేస్తున్నాగురా?"

"చిత్తం దే–వ–రా......"

"చెప్పు"

"చిత్తం చిత్తం మహాప్రభూ! నలుగురు భోగం పిల్లల మధ్య కూ మన్నారండి గోవిందయ్యగారు''

"ఊ హూ''

"ఒకపిల్ల బాబుగారి ఒడిలో పడుకుని కిచకిచలాడుతూ కబుర్లు చెబుతోంది దేవరా"

"సరే''

"చుట్టూ ఉన్న నలుగురు పిల్లలూ తమలపాకులు చిలకలు చుట్టి అందిస్తున్నారు మహారాజా!"

"బాగుంది''

"గోవిందయ్యగారు రెండుచేతులతోటీ అందుకుంటున్నారు బాబయ్యా"

"రెండు చేతులతోటీనా?"

"చిత్తం బాబయ్యా"

"అయితే—రెండుచేతులతోటీ నోట ఉంచుకుంటున్నాడు కదూ?''

"లేదులేదు మహాప్రభూ! కుడిచేత్తో పుచ్చుకున్నదీ కుడిచేత్తోటే నోట ఉంచుకుంటున్నారు, యెడంచేత్తో పుచ్చుకున్నదీ కుడిచేత్తోటే నోట ఉంచుకుంటున్నారండి—"

మంత్రి గర్భి మని అందుకుని "నాకొడుకు చెడిపోలేదు మహాప్రభూ! చెడిపోడు మహారాజా" అన్నాడు.

"ఏమిటోయ్ నువ్వనేది?"

"ఎడమచేత్తో యేదీ నోట ఉంచుకోగూడదన్న సంగతి పరవశుడై ఉండికూడా నాకొడుకు మరిచిపోలేదు. ఈఔచిత్యపరిజ్ఞానమే నాకీ ధైర్యం కలిగించింది ప్రభూ!

మహారాజు కేమీ పాలుపోలేదు. "అయినా చూస్తాం కాదూ?" అంటూ యెదటికి చూడగా దూరాన గుర్రం వస్తోంది. పచ్చని మైదానంమీద తెల్లని గుర్రమూ, తెల్లని గుర్రంమీద చీనాంబరధారీ, అతనిమీద వృద్ధభానుని గారకిరణాలూ—చాలా దర్శనీయంగా ఉంది ఆదృశ్యం. పైగా మనోవేగంతో వస్తున్నాడు గోవిందయ్య. గుర్రం కాళ్లు నేలమీద ఆనుతున్నాయో లేదో యేమీ తెలవడంలేదు.

వినడమే కాని మహారా జెప్పుడూ గోవిందయ్య స్వారి చూడలేదు. రామయామాత్యుడికి కూడా యిది అదృష్టపూర్వమే; కాని తతిమ్మా అన్నింటా కొడుకు చురుకుతనం కళ్లారా చూస్తూవుండడంవల్ల అతని కిది పరిచితంలాగే వుంది.

మహారాజు రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు.

కోటకి కూతవేటుదూరంలో ఒక కాలవ వుంది.అది చాలా వెడల్పయిందే; కాని అప్పు డందులో ప్రవాహం లేదు. దానిమీద వంతెన ఉంది, కాని దిగువకి వెళ్లి మళ్లీ యెగువకి రావాలి.

"కాలవలో పడిపోతాడు, చూస్తా వేమిరా'' అని మహారాజు కంగారుపడుతూ లేచాడు; కాని మళ్లీ చూశాటప్పటికి గుర్రం కాలవదాటేసి కన్నుమూసి తెరిచేటప్పటికి సింహద్వారంలో ప్రవేశించింది.

రాజు మళ్లీ కూచునేటప్పటికి గోవిందయ్య వచ్చి తండ్రికి నమస్కరించి చేతులు కట్టుకుని రాజుయెదట నుంచున్నాడు.

౪

రామయామాత్యుడు తనని కానట్టు మొగం వంచుకునీ, చెవులు అప్పగించీ కూచున్నాడు. గుండెలు దూసుకుపోయేటట్టు ఒక్కమాటు గంభీరంగా చూసి మహారాజు అందుకున్నాడు.

"గోవిందయ్యా"

"చిత్తం మహాప్రభూ"

"ఏమిటోయ్ విశేషాలూ!"

"ఏలినవారి సెల వయిం దని నౌకరు తొందలువిడిపించగా చేతనయినంత తొరగా దర్శనానికి వచ్చాను మహారాజా"

"చాలా అవసర మయిన పనిలో నిమగ్నుడవై ఉన్నట్టున్నావు పాపం"

"..........................."

"మాట్లాడవేం!"

"నిజం చెప్పడం అవినయం అనిపించుకో దని ధైర్యంతో విన్నవించుకుంటున్నాను. పనిలేని పిల్లలకి ఎందులో ప్రవేశించినా అది అత్యవసరమయిన పనే జగత్ప్రభూ"

"... ......................."

"దాపరికం లేకుండా ప్రవర్తించడమే నా అలవాటు. నానోటనే వినా లని—"

"అయితే,......నీ అవసరం చాలా వచ్చిం దిప్పుడు"

"చేతులు కట్టుకుని సేవలు చేసుకుంటాను మహాప్రభూ"

"మేమూ మీనాయనా ఆరు నెలలు విశ్రాంతి పుచ్చుకోతలిచాము"

"ఏలినవారి చిత్తం"

"మళ్లీ రాజకార్యాల్లో ప్రవేశించేదాకా అబ్బాయి రాజూ, నువ్వు మంత్రివీనీ"

"జగత్ప్రభువుల అనుగ్రహానికి పరవశుణ్ణవుతున్నాను. మహాప్రసాదం"

"..........................."

"ఈడుడుకుపిల్లవాడిమీద ప్రభువులకు కలిగిన నమ్మకానికి విస్మయం కలుగుతోంది. మాతండ్రిగారికి చేదోడు కాగలిగినందుకు ఆనందమున్నూ కలుగుతోంది. ప్రభువుల మనస్సు కరిగేటట్టు ప్రవర్తించడానికి పూనుకుంటాను"

"మరి వెళ్లిపో"

"చిత్తం, చిత్తం. చిన్నమహారాజావారి దర్శనం—"

"రేపు ఉదయం మంచిది"

"చిత్తం, అప్పుడే చేసుకుంటాను మహారాజా"

గోవిందయ్య మహారాజు యెదట శిరస్సువంచి, తండ్రి కాళ్లు కళ్లకద్దుకుని, వెనక్కి వెనక్కి నడుస్తూ బురుజు దిగాడు.

* * * * *

గుఱ్ఱం మళ్లీ మైదానంమీద ప్రత్యక్షం అయింది; కాని యిందాకటి చురుకు లేదు. బేడీలు తగిలించినట్టు కాళ్లు అతిభారంగా యెత్తుతోం దది.

ఇందాకా క్షణంలో వెనకబడ్డ కాలవ యిప్పుడు అరగడియకి సమీపించింది. వెంటనే గుఱ్ఱం నిలిచిపోయింది.

గోవిందయ్య ఒక్కమాటు అటూ యిటూ చూసి, గుఱ్ఱం దిగి, కళ్లెం పట్టుకుని కాలవలో నడిపించుకువెళ్లి, ఒడ్డెక్కి మెల్లిగా—తాపీగా గుఱ్ఱంకూడా యెక్కాడు.

మహారాజు కళ్లు మెఱుపులు కమ్మాయి.

"అదేం!"

"ఏమిటి మహాప్రభూ!"

"గోవిందయ్య గుఱ్ఱం దిగాడేం!"

"కాలవ అడ్డువచ్చింది మహాప్రభూ!"

"ఇందాకా దాటించుకువచ్చాడు కాదూ!"

"అప్పుడు మంత్రికొడుకు మాత్రమే కనక"

"ఇప్పుడు!"

"మహామంత్రే కాదా మహాప్రభూ!"

మహారాజు చకితు డైనాడు. మళ్లీ చూడగా గోవిందయ్య యింటికేసి బయలుదేరినాడు:

"అలా యెక్కడకి!"

"ఇంటికి వెళుతున్నాడు మహాప్రభూ"

"భోగంవీధికి వెళ్లడూ!"

"ఇక యీజన్మలో కాదు మహారాజా"!

"..........................."

"..........................."

"అయితే—వెళ్లాటప్పుడు వంతెనమీదనుంచి కాక కాలవ దిగి వెళ్లాడేం!"

"ఇందాకా ఏలినవారి కళ్లయెదట తన పొగరు మోత్తనం చూపించాడు. ఇప్పు డందుకు క్షమాపణ చెప్పుకున్నాడు జగత్ప్రభూ!"

"ఏమన్నాడూ?"

"నాకొడుకు మహామంత్రిపదవి నిర్వహించడానికి తనకి గల అర్హత చూపించుకున్నాడు మహారాజా"

"............చూడూ"

"చిత్రం"

"గోవిందయ్యా శక్తియుక్తులు కనిపెట్టలేకపోయాను సుమా"

"ఇప్పటిదాకా అవసరం లేకపోయింది జగత్ప్రభూ"

"పొరపాటే"

"తమ రలా సెలవివ్వడం ధర్మమూ!"

"నీకొడుకు శక్తియుక్తులకు తగిన రాజు కాడోయి నాకొడుకు"

"తమరు అతిశయోక్తులు సెలవిస్తున్నారు. యువ రాజావారి ప్రజ్ఞకూడా నివురుకప్పిన నిప్పులాగ ప్రచ్ఛన్నమై ఉంది మహారాజా!"

"......గోవిందయ్యాని పట్టి నువ్వూ, నీకంటే నేనూ, నాకంటే తిమ్మాజగపతీ అదృష్టవంతులమోయ్"

"ఏలినవారికి మామీద ఉన్న అనుగ్రహం యిలా అనిపిస్తోంది"

"అంతా బాగానే ఉంది; కాని పాతవిచారం పోయి కొత్తవిచారం పట్టుకుంది"

"సెలవిప్పించండి"

"నీకొడుక్కి సుఖం లేకుండా చేశాను. పాలబుగ్గల వాణ్ణి యినపచేతులతో పిసికేశాను"

"మావంశం వత్సవాయివారిని సేవించడాని కేర్పడింది. నాకొడుకుమీద కూడా ఏలినవారికి అనుగ్రహం కలగడం నాఅదృష్టం. మహాప్రభూ! నాజన్మ సఫలమయింది"

"మరి నాజన్మమాట యేమిటి?"

"ఏలినవారు కారణజన్ములే కాదా మహారాజా!"

"నాకో సంకల్పం కలుగుతోందోయ్!"

"చిత్రం"

"నువ్వు మరోలాగ అనుకోవు గాని—"

"ఎప్పు డేనా ఉందా మహారాజా?"

"నిజమే......ఈరోజు—ఈక్షణం మొదలు నీకొడుకే మహామంత్రి"

"మహాప్రసాదం స్వామీ"

"మరి రాజు?"

"ఏలినవారే"

"కాదుకాదు, తిమ్మాజగపతి"

"......................."

"ఏం, అలా తెల్లపోతా వేం?"

"తమరు సెలవిచ్చేది—"

"అతు రాలా ఉచితంగా ఉంది. నాకు గోవిందయ్యా మహామంత్రి అయితే ఉజ్జీ యెలా ఉంటుందో తెలుసునా?"

"ఏలినవారే సెలవివ్వాలి"

"ముసలి ముగుడికి పడుచుపెళ్లాం—"

"వద్దువద్దు, మహారాజా! తమ రలా సెలవిప్పించడం నేను వినలేను"

"ఇక చర్చవద్దు. ఇది యిలా జరిగితీరవలసిందే...... నాకొడుక్కు, నీకొడుక్కి కూడా ప్రాజ్ఞత వచ్చింది. బాధ్యత కూడా చక్కగా తెలిసింది"

"......................."

"మనకి దబ్బ ర్యేళ్ళు నిండాక-కొడుకులు చేతి కంది వచ్చాకకూడా మనం ఉట్టికట్టుకు ఊరేగడం అనేక విధాల అనుచితం"

"......................."

"పైగా మనం పూర్వకాలపువాళ్లం. ఈకాలం మన పిల్లలిది"

"రఘువంశమహారాజుల అంశ అంతా తమలో కన పడుతోంది మహారాజా"

"పట్టాభిషేకప్రయత్నాలు త్వరగా సాగించు"

(ఈకథలో వస్తువు తరతరాలనుంచి పెద్దల నాడుకలో ఉంది. రచనమట్టుకే నాది. (శ్రీ. సు. శాస్త్రి)

# ఆంధ్రులు—నాట్యకళ

గరిమెళ్ల సత్యనారాయణగారు బి. ఏ

నాట్యకళ అన్నది ప్రతిదేశంలోనూ, ప్రతిజాతిలోనూ, ప్రతిభాషలోనూ పూర్వకాలం నుంచీ వుంటూ వున్నది. ఇప్పుడూ ఉన్నది. అయితే యుగయుగానికీ దానిలో అనేకపరివర్తనలు జరుగుతున్నవి. శబరులు, భిల్లులు, కోయలు మొదలగువారు వారిభాషలలో ఏవో పాటలు పాడుతూ ఆడుతూ, సంభాషణలు జరుపుతూ, మద్దెలలు తాళాలు గజ్జెలు కంకణాల చప్పుళ్ళతో యేవో ఇతిహాసాలు చెప్పుకుంటారు. అవి వారికెంతో ఆనందంగా వుంటాయి. ఆభాష తెలియకపోయినా మనకీ ఆనందంగానే వుంటాయి. ఆభాష ఆ పాట, ఆనృత్యం, ఆలయ, ఆ అభినయం అంత సక్రమంగా వారి కెట్లావచ్చాయో ఆశ్చర్య మవుతుంది. ఈ మాత్రం నేర్చుకుంటకు మన నటులు అద్దాలదగ్గర నిల్చుని, గురువుల దగ్గర నేర్చుకొని, అనుభవజ్ఞులను చూచుకొని నానా తాపత్రయం పడవలసివస్తున్నది దీనిని బట్టి చూస్తే నాటకకళకీ నాగరకతకీ యేమీ సంబంధములేదనీ, ఎంత అనాగరకమైన జాతికైనా ఏదో అనిర్వచనీయమైన ఆనందం కూర్చే నాట్యకళ సహజంగా వుంటుందనీ, నాగరకులైతే దానికి లక్షణములు వ్రాసి, శిక్షణములు చేసి ప్రదర్శనములు సలిపి తమ ప్రాశస్త్యమును తాము చాటుకొని కీర్తిమంతులు కాగలరనీ లేకపోతే అట్టి అవకాశములు వారికి చిక్కవనీ మాత్రమే మనమనుకోవాలి.

ఇక మనకు తెలియని భాషలలోనుంచీ తెలియని గాథలలోనుంచీ తెలిసిన భాషలలోకీ తెలిసిన గాథలలోకీ వద్దాము. తెలుగులో అడవిజాతులవారు చెంచితకథలు మొదలైనవి ఆడుతారు. వారికి శ్రీకృష్ణమూర్తి అంటే ఏయే ఆకారంతో వుండవాలో, ఎటువంటి భావాలుండవాలో, ఎటువంటి సుగుణాలుండవాలో, ఎటువంటి రసగ్రహణపారీణుడై వుండవాలో, ఎటువంటి పరివారమిత్రశత్రుసమేతుడై వుండవాలో, ఎటువంటి కథలు అతని మహాత్మ్యము విశదం చేయగలవో చక్కగా తెలిసినట్లు తోస్తుంది ఆధునికనాగరకతా కలుషితదృష్టికీ కల్పితవిమర్శనా సూత్రములకూ అహంకారభరితమైన సిద్ధాంతములకూ అదంతా ఒక వెఱ్ఱిబొంగరప్పు వ్యవహారం లాగా మనమంతా రసనిషుల్లము లాగా కనిపించినా, సద్విమర్శకుల కుండవలసిన తాదాత్మ్యభావంతోనూ, రసగ్రహణపారీణుల కుండవలసిన ఆనందదృష్టితోనూ పరిశీలిస్తే నాట్యకళాదేవత వారికుచితమైన స్వరూపముతో వారికిని ప్రత్యక్షమై, మాటలలోను పాటలలోను ఆటలలోను రసవంతముగా వ్యాపించి వారి సానందపరవశులను జేసి చూపరులనుగూడ ఆనందపరవశులనుగా ఒనరించే దనుట కాటంకం లేదు ఈ విధంగానే గారీశంకరుల కథలు వల్లీసుబ్రహ్మణ్యేశ్వరుల కథలు, మరి యెన్నో మనోహరమైన గాథలు సంపూర్ణరసతుందిలములై ఆ అజ్ఞాతకవీశ్వరుల వాక్కులలో పుట్టి నటుల అభినయములలో మెలసి, పాటలలో ప్రాకి, ప్రదర్శనములలో నెలకొని దర్శకలోకము సానందపారావారములో ముంచే పనదానికి సందేహం లేదు. తిండి తిప్పలకోసము పాట్లాటలు కొట్లాటలు కోసము పోరుయే నియమితకాలం పోగా మిగిలినకాలములో వారు అందులో ప్రవీణులను చూచి ఆ కళలను నేర్చుకొని అడి ఆనందములో తేలి యీ కపటభూలోకమును మఱచిపోతూవుండే వారు. వారిలో స్నేహశీలతలు, వికమత్యము, సంఘీభావము, ఆత్మబలము దీక్షాపటుత్వము మెండుకొని వీరవరులై, ఉదారులై నీతిమంతులై, మనము నాగరకు లనుకునే ఉన్నతజాతులవారితో సమానమైన అంతస్థుకు వచ్చారంటే వారు ఈ నాట్యకళాముగ్ధత్వమువల్లనే అట్లు తయారైనారు కాని మనము వారినిగూర్చి చేసే సంఘసంస్కరణలు, రాజకీయహక్కులు, ఆర్థికసౌభాగ్యం కోసం పెట్టుబడిదారుల తోటలలోకి గనులలోకి యెగుమతి చేసే బానిసవ్యాపారములు కూలిపనులవలన కాదని మనము నమ్మవచ్చును. అనుశృతమై వస్తూవున్న వారి సంప్రదాయజీవనంలో మనస్వార్థం అహంకారం కొలకు మనము మనము వ్రేలుపెట్టి మనమాదిరి బొమ్మలుగానే మార్చే ప్రయత్నాలవల్ల వాళ్ళని మఱింత రసాభాసము చేశామో లేక ఉన్నతులను చేశామో సంశయాస్పదమైన విషయము. ఉన్నతజాతు లనుకొనబడేవారితో బలవంతంగా గాక స్వతస్సిద్ధంగా కలిగే పరిచయమువల్ల వారియొక్క గాథలు సంప్రదాయములు ఆశయములు కొన్ని తమలోకి ప్రవహిస్తూవుంటే వాటికికూడ వారు తమ స్వతస్సిద్ధమైన ఆటలు పాటలు అభినయములతో స్వాగతమిస్తూవుండేవారు అహంకారదూషితులు కాని ఈ తముజాతుల వారు కూడా వారి గాథలకు, పాటలకు, నటనములకు ముగ్ధులై యథానుకూలంగా తమ సాహిత్యములలోకి, సంప్రదాయములలోకి జొప్పించి వారి వారికి గల అంతరములకు వంతెనలుగట్టి పరస్పరాభిమానవిజ్ఞానములకు దారి కల్పించేవారు

మన పురాణములలోనికి కొన్ని అనాగరకగాథలు, వారి గాథలలోనికి కొన్ని మనపౌరాణికకథలు చొచ్చుకొనివచ్చి, కొన్ని ఆచారవ్యవహారములలో వారికీ మనకీ కొన్ని భేదాలుండవలసిన రీతిగా ఉన్నా, వారినీ మనని ఒక భారతజాతీయతా పతాకముక్రింద సోదరగణమువలె తాండవించునట్లు చేశాయంటే వారికీ మనకూ ఒకరియెడల ఒకరికి గల యభిమానగౌరవములవల్లనే కాని వేఱుకారణము చేతను కాదని మనమూహించుకోవాలి. మనపండితులు మనపురాణములు, కర్మకాండలు, ధర్మశాస్త్రములు వేదాంతములు మొదలగు వానిలోని జ్ఞానమంతటినీ తేటతెలుగు పద్యములలోను, పాటలలోను, హరికథలలోను యక్షగానములలోను పాడి ప్రదర్శించడంవల్ల వాటి తత్వం నిరక్షరకుక్షులకు కూడా ప్రవహించి వారి నాకర్షించి, వారిలో జీర్ణమై, వారి పదకవిత్వములు ప్రదర్శనములలో కూడా మెలసి వారిని ఉన్నతులుగా చేసి మనకు సమీపంలోకి తెచ్చేవి. మనపండితులు రసికులు, శ్రీమంతులు, రాజులు మొదలయిన వారు రసమంతా తమలోనే తప్ప మరెక్కడా లేదనుకోక, నాట్య

కళకు తాను మాత్రమే పెద్దకొని మరియొక్కడూ వుండదనుకోక వీరి ఆటలను పాటలను కూడ మెచ్చుచు ఆదరించుచు పండుగలయందు పబ్బములయందు, శుభములయందు శోభనములయందు, దర్బారులందు సాధారణసభలయందు ఆదరించి ప్రోత్సహించుటవల్లనే అవ్వియు మన కళలతో పాటు ప్రక్క ప్రక్కన వర్ధిల్లుచు నశింపకుండ రాణించుచున్నవి. నిజమైన కళ కాని సంప్రదాయము కాని తోడి కళాసంప్రదాయమునకు రూపుమాయకుండ అభివృద్ధి పొందుట కవకాశములు సృజించుచుండుటలోనే రాణించును. ఇదియే భారతీసంప్రదాయమునకును అన్యసంప్రదాయమునకును గల ప్రభేదము. అన్యసంప్రదాయములు అభివృద్ధిపేర, సంస్కరణము పేర, పరివర్తనము పేర, శుద్ధి లేక కన్వర్షను (Conversion) పేర ఇతరసంప్రదాయములలోని మేలులను చూడనోపక చూడనేరక తామే యుత్కృష్టము లను నహంకారముతో వానిని చెరిపివేసి వాటి కాగ్రములమీద తాము పేరును పెట్టుకొని పరిపాలింపగోరును. భారతసంప్రదాయము సుగుణము బ్రహ్మముగలె సర్వవ్యాప్తమనియు. ఏ సంప్రదాయమైనను కాలవశమున నంటెడి కలుషము సహజముగాక తాత్కాలికమనియు సంకరదోషమనియు గ్రహించి అన్ని సంప్రదాయముల నాదరించి అన్నింటిలోని దోసగులును తమంతట తామే రాలిపోవుట కవకాశములు కల్పించుచుండును. భారతసంప్రదాయ మితరములను తమలాగ మార్చుకుంటే వారికి ముక్తిలేదనికాని, ఇతరములలా తాను మారకుంటే తనకు గతిలేదని కాని ఒకనాటికిని నమ్మదు. ఇందువలననే భారతదేశమునకు స్వతస్సిద్ధమైన వైదికమతము ఇతరులకు ముద్రలువేసి తనలోకి మార్చుకోవడంకోసం డబ్బు దండుగ పెట్టలేదు, ఆశల నెఱచూపలేదు, కత్తిదూసి మానవ రక్తమును ప్రవహింపజేయలేదు. అట్లే భారతకళలు శిల్పములు మొదలగునవి సమస్త సంప్రదాయములకును స్థానమిచ్చుటలోనే రాణించినవిగాని వేనినిగాని సంహరించలేదు, అనాదరణ చేయలేదు, సంకరము చేయలేదు. భారత సంప్రదాయము మతమునందైననుసరే, సంఘమునందైనను సరే, కళలయందైనను సరే. జాతి భేదముల నంగీకరించునుగాని సంకర దోషములను సహించదు, సంహారణ మసలే దానికి కిట్టదు. ఈ కారణములచేత మన భారతజాతీయ నాట్యకళ శుద్ధమూర్ధ అనుకొనబడే అడవి జాతులనుండి నేటివరకు ఎన్నెన్ని యుచ్చములు పతనములు మార్పులు పొందెనో అన్నింటితో ఇచ్చట కానవగును. పాశ్చాత్య నాగరకతా లక్షణమగు అహంకారము మన కవులు నటులు దర్శకులు విమర్శకులు మొదలగువారిలో ప్రవేశించిన నాటినుంచీ, 'మనమాడుతున్న ఫక్కీ-వొక్కటీ ఉత్కృష్టమైనది, ఇంగ్లీషుస్టేజికి చాలా దగ్గరగావున్నదని వూహించి, ఇంకా దానిలాగే చేసేదామని కేవలం గద్య నాటకాలలోను సాంఘిక చర్యలతో నింపేదామనే వూహాలు మనకు పుట్టుకొస్తున్నాయి; తక్కిన విధములైన ప్రదర్శనములు అనగా—వీధి నాట్యములు, వీధి నాటకములు, బొమ్మలాటలు, భాగోతములు, హరికథలు— మొదలగు వానియెడల నిరసనము పుట్టుచున్నది. కాని ఇంతవరకూ ఇన్ని విధములైన ప్రదర్శనములూ సమానాదరణోత్సాహముతో పెద్దింటివారిచేత చిన్నింటివారిచేత దర్శింపబడుతూ వుండేవి. ఆంధ్రనాటక కళాపరిషత్తువారు సాంఘిక నాటకమునకు తామియ్యదలచుకున్న ప్రోత్సాహముతో బాటు ఈ యేడాది యక్షగానమునుగూడ ఆదరించినందుకు దాని మహిమను గుర్తించి ప్రజలకు చాటినందుకు ధన్యులు. వచ్చేపరిషత్తునుండి బొమ్మలాటలకు, వీధి నాట్యములకు, మంచి హరికథలకుకూడ ఆదరమొసంగి శిథిలమగుచున్న జాతీయ నాట్యకళలకు పూర్ణజీవనము నొసంగవలెను.

నాటకకళా పరిషత్తువారుకాని, మరొకరము పెద్దవిద్వాంసులు కాని వాటి నాదరించక పోయినంతమాత్రమున అవి పూర్తిగా చచ్చిపోవునని మనము భయపడనక్కరలేదు కాని పెద్దవారు వీనిని గూర్చి అలక్ష్యము చేస్తే తక్కినవారికి కూడా వీటియందు అగౌరవము కలుగుతుంది. లేదా పెద్దవారికి గిరీఫక్కీలు హిందూస్థానీ ఫక్కీలు వీరుకూడా అవలంబించి వారికళలలోకి చొప్పించి వాటిని కల్తీ చేసి అసలు రూపము మాసిపోయేటట్లు చేస్తారు. గత పరిషత్తులో జరిగిన కూచిపూడివారి ప్రాచీన నాట్యకళా ప్రదర్శనములలో ప్రస్తుతపు చౌకబారు నాటకరాగాలు అభినయాలు ప్రవేశించడం చూస్తే చాలామందికి విచారం కలిగింది. ఈలాగున కలపకపోతే ఇప్పటి రసికలోకమునకు నచ్చదనీ. ఇట్లు కలపడమే ప్రశస్తమూ పాపము! వారూహించి, వారి ప్రాచీన నాట్యకళ నీవిధంగా మాడర్నైజ్ చేయబూని దాని నిజస్వరూపమునకు వికారము తెచ్చినారు. ఈలోపమును కొందరు వారికి చూపించినప్పుడు వారు మిక్కిలి సంతోషించి వెంటనే దిద్దుకుంటామని చెప్పినారు. ఈలాటి మాడర్నైజేషను లోపాలే మన తెలుగునాడు హరికథలలోకి, బొమ్మలాటలలోకి, వీధిపాటలలోకి కూడా చొచ్చుకొని వస్తున్నాయి. ఇటువంటి మాడర్నైజేషనువల్ల మన నాటకరంగమే యెంతవరకు అభివృద్ధి పొందెనో లేక దిగజారిపోతోందో నిర్ణయించడం కష్టంగావుంటే పైకళలలోకి కూడా ఇది ప్రాకిందంటే యెంత విచారకరము! మన హరికథలలోకి హిందూస్తానీ కర్తేకాక హిందూస్తానీ పాటలే దూరి పోతున్నాయి. వినేవారికి అవి అర్థం కాకున్నా శ్రోతలకనక వారిచుట్టూ మూగడం, వాటిలో ముక్కలు పట్టుకొని అర్థం చెడగొట్టుతూ పాడుకోవడం అలవాటైపోతున్నది. ఈవిషయంలో నాటకరంగంవారు, పేరుమోసిననటులూ పైవారికి మార్గదర్శకులై తెలుగు నటనమును, తెలుగు రాగములను, తెలుగుతనమునూ సంరక్షించడానికి పూనుకోవడమునకు బదులు కలగాపులగం చేయడం అంత సమంజసమైన కార్యం కాదనిపించుతుంది.

అయితే మన దేశములో అనుశ్రుతమైన పై కళలు ప్రదర్శములు మొదలగు వానిని అనుశ్రుతమైనవన్న కారణంచేతనే ఆదరించ

వాలా, అవి మహాపరిపక్వములై నిర్దోషములైనవా, వాటికి జిలుగులు పెట్టితే వాటికి కళంకం వస్తుందా అని కొంద రడుగవచ్చును. వాటిలో లోపాలు లేవని యెవ్వరూ చెప్పరు. అవి ఒకకాలమున సభ్యులకు ఆనందకరంగా వుండినా నేటి నాగరికులకు కొంచెము మోటుగాను చాదస్తంగాను వుండవచ్చును. అయినా వాటిలో తెలుగుతనము ప్రాచీనత తొలుకాడుచున్నవి ఆ తెలుగుతనమునకు ప్రాచీనతకు భంగం కాకుండా చాదస్తమును కొంత తొలగించవచ్చును, మోటుహాస్యములను తీసివేసి నాజూకైన హాస్యమున కక్కడ స్థానము నీయవచ్చును అంతమాత్రమున వాటి ప్రాచీనతకు గాని తెలుగుతనమునకుగాని భంగము కలుగక వన్నెయే హెచ్చునని చెప్పవచ్చును. ఈ చాదస్తమును మోటుతనమును వానిలో మిక్కిలి హెచ్చుగా వుండుటకు గూడ మనవంటి విద్యాధికులమే ఒకరీతిగా కారకులము. మనము వాటిని దర్శించుటకాని ప్రశంసించుటకాని విమర్శించుటకాని మానుకొని, వాటిని గూర్చి తలచుకోవడమే పరువుతక్కువక్రింద భావించుకున్నాము. వాటి నాదరించి పోషించి నేర్చుకొని వ్యాపింపజేయవలసినవా రంతా సర్వసాధారణులైన జనములే యైనారు అట్టివారికి రక్తికట్టేటట్లు చేయడానికే వానిలోనికి బూతుహాస్యములు అనవసరచాదస్తము ప్రాకిపోయినవి. మనవంటివారికి కూడా వానిలో శ్రద్ధాభక్తు లున్నవని వారికి తెలిస్తే, మనము కూడా కొస్త వెళ్ళి కూర్చుని చూస్తే, వానిని గూర్చి విమర్శిస్తూ ప్రశంసిస్తూ పత్రికలలో వ్యాసాలు వ్రాస్తే వానిలోని లోపములను వారు దిద్దుకొని మనవంటివారు—స్త్రీలు పురుషులుకూడా—కూర్చుని నిస్సంకోచముగా విని ఆనందించుట కర్హమైనట్లుగా వానిని వారు సంస్కరించుకుంటారు.

ఈవిషయంలో తమిళులు కన్నడులు మళయాళీలు మొదలగు దక్షిణహిందూదేశపు జాతులవారు మనకంటె చాలా నయం. మనకు దేన్ని చూసినా వేళాకోళం. ఏదైనా క్రొత్తవుద్యమం వచ్చిందిరా అంటే మనలని ఉప్పెనలాగ ముంచుస్తుంది సహాయనిరాకరణమనే అప్పటికి మన నాయకులు ప్రజలు కూడా ఆంధ్రరాష్ట్రసమస్యను, తక్కిన సమస్యల నన్నిటినీ కూడా అగ్గిపుల్లపెట్టి ముట్టించేశారు. హిందీ నేర్చుకోమని గాంధీగారు ఎలుగెత్తి అన్నారో లేదో మన వారు తెలుగుపుస్తకాలూ పత్రికలూ అవల విసరేశారు సరేగదా ఓనమా అయినా నేర్చుకోవడం మానేశారు. సంఘానికి సంస్కరణ మవసరమని యేపెద్దలో అనేటప్పటికల్లా పత్రికలనిండా ఒకటే సుత్తకం కల్పితకథలు—అరవైయేళ్ళ వాళ్ళకి ఆరేసి వేలరూపాయాలకి ఆరేసేళ్ళ పిల్లల నమ్మి పెళ్ళిళ్ళు చేస్తున్నట్లు, పెళ్ళికొడుకులు పీటలమీద చస్తున్నట్లు, పడుచువిధవ లందరూ గర్భాలు దించుకుంటున్నట్లు, క్రోపింగుపెళ్ళికొడుకులవెంట పడుతున్నట్లూ, ఇంగ్లీషు చదువుకుంటున్నవాళ్ళే సంఘాన్నుద్ధరించుచున్నట్లు, కర్మలయందు శ్రద్ధగలవారలయందు అభిమానముగల సనాతన బ్రాహ్మణు లందరూ స్వార్థపరులైన పాపాటురాముళ్ళూ, హిందూసంఘం కూకటివేళ్ళతో కూలిపోయే మార్గాలను యువకు లందరూ వెతుకుతున్నట్లూ—చిత్రచిత్రములైన బొమ్మలతో సహా రొక్కపోతున్నాయి. మనలని మనము దూషించుకోవడం, ఇతరుల ఎంగిలిపద్ధలను కోతులవలె అనుకరించుకోవడం మన ఆత్మగౌరవాని కెంత భంగకరం, మనజాతి కెంత సిగ్గుచేటు అనే భావం మనము మరచిపోయి ఒక్కమాటు విశ్వమానవధృశ్యమునకు మూడుమెట్లుమీది కెగిరిపోతాము. అదంతా మనకు సాధ్యంకాని వ్యర్థమిథ్యత్వమనీ దానికోసం అఱులు చాచుకోవడంలో మన కాళ్ళక్రింది మన్నంతా దొల్చుకపోయి మనకు నిలవ నీడలేక అధఃపాతాళములోనికి కూరుకొనిపోతున్నామనీ మనకు చీమకుట్టినంతమట్టుకైనా తెలియదు. బులోమంటే అందఱం ఒక్కపక్తిని కూర్చొని బుఱ్ఱలు గొఱిగించుకుంటాము. ఇందుకనే ఆంధ్రుడు తనది గోల్పోతున్నాడు ఇటువంటి వాడా పరులయొక్క ఉత్తమధర్మములను జీర్ణం చేసుకోనేవాడు' కాదూ పోదూ అంటే వాళ్ళ మెఱుగులు కొన్ని మీదన పూసుకొని కత్తిరీజాతివారిలాగ తయారౌతారు.

తక్కిన ద్రావిడజాతులకు వేనికీ యింత అధ్వాన్నంగతి పట్టలేదు. అరవవారిని తీసుకుంటే వారిలో కూత్తాటలు, తిరుప్పుగళు, తెమాంగు, తేవారం మొదలగు జాతీయకత్తురాగాలు, పాటలు, తాళాలు, నాట్యాలు అన్నిజాతులవారు కొందరు ఆడిపాడి ఆనందించేవారు తక్కినవారు చూచి ఆనందించే వారు గావున్నారు. నిజానికిచూస్తే త్యాగయ్య కీర్తనలను త్యాగయ్యకర్తృక రాగాలను వారు కనుకవలె వాడకుండా నేటిదాకా జననకాలపు సొగసుతోను నవకంతోను రాణించేటట్లు రక్షించి పాఠాలు చెప్పి మప్పుతూ, గ్రామఫోను ప్లేటులకిస్తూ అతనికీర్తిని మహిమను నిలబెట్టుతున్నారు కాని మన వైతే యే హిందూస్తాని కత్తులతోనో మిళితంచేసి తాకట్టుపెట్టి అయిపు కానరాకుండా చేసివుందుము. ఒక్క త్యాగయ్యకీర్తన లేమిటి? క్షేత్రయ్య పదాలు, మరికొన్ని జావళీలు జతులు వర్ణాలు మొదలగు వానిని కూడా వారి ప్రాంతములలోనే కత్తిరీలేని కమ్మదనముతో మనము వినగలము. వారు అసలు సహజంగా సంగీతముగ్ధమైన జాతి కనుక ఏయే కత్తుకు ఏయే కళకు ఎటువంటి గౌరవస్థానంలో వుంచవాలో గ్రహించి ఆయాగౌరవము లిచ్చి ఆదరించుతున్నారు. మనకు క్రొత్తనుచూస్తే పాతదిరోత. అందుచేత క్రొత్త ప్రాత రెండులేకుండా పోతున్నాయి. వారిలో క్రొత్తప్రాత రెండుకూడా సరిక్రొత్తగా, రాణించుతున్నాయి. మళయాళీజాతివారు 'కథాకళి' యను నాట్యకళను ఇంకా నిలబెట్టి భరతమహాఋషికి శాశ్వతమైన స్థానం కల్పించినారు. మన పురాణేతిహాసముల నన్నిటిని మాటలకు రాగములకు కూడా అందని అనిర్వచనీయమైన అభినయ సౌందర్యములో వారు నృత్యంచేసి విస్తరింప చేస్తారు. ప్రజలు దానినిచూచి గ్రహించి ఆనందించ గలుగుతారు. వారికి నటకులకూ మధ్యన అర్థం చెప్పే అనువాదకులు (Intepreters) అవసరంలేదు. మన కూచిపూడివారి నృత్యమును వారు మెచ్చి గ్రహించినట్లు మన తెలుగువారు

మెచ్చలేక ఆగింత దానికి చేతులు త్రిప్పడానికి కసరత్తుకే అర్థమేమిటని అడిగినవారు కూడా కలరు. వారికంటె మనము తక్కువ బుద్ధిమంతులము రసగ్రహణపారీణులము అని అర్థము కాదు, వారు మనకంటె తక్కువ నవనాగరకులనీ అర్థము కాదు. మనకు క్రొత్తదానిని చూడగానే ప్రాతదాని మీద నిగా తప్పిపోతుంది, వారికి తప్పిపోదు. ఏజాతికైనా వారి నాట్యకళతో వారి జాతీయతయొక్క సుందరతరమైన వ్యాఖ్యానమై వుంటుంది. వారు తమ నాట్యకళలో తమ ప్రాత క్రొత్తదనముల నెట్లు రాణింపజేసుకుంటున్నారో తక్కిన సమస్తమైన ఆచారవ్యవహార సంప్రదాయములలోనూ ఆ విధంగానే క్రొత్తప్రాతల నావిధంగా పోషించుకోగలుగుతున్నారని చెప్పవచ్చును. మన నాట్యకళ నొక్కదానినే పరిశీలించినయె తక్కిన మన సాంఘిక రాజకీయ సాహిత్యసమస్యలలో కూడా మన యొక్క సహజమైన జాతీయతనుండి యెంతవరకు దిగజారుతున్నామో క్రొత్తవాని నెట్లు జీర్ణము చేసుకోలేక అజీర్ణసంకటం వారివలె మనము బాధపడుతున్నామో మనము నిశ్చయం చేసుకోవచ్చును.

అరవనాటక రంగంలో పాటలెక్కువ అని, ఆపాటలకోసమే ప్రేక్షకులు వచ్చి ఆనందించుకొని పోతారనీ, క్రొత్తపద్ధతుల ప్రకారము నాటకరంగము పరిణమించకుండా ప్రజలు అడ్డుతగులుతున్నారనీ, అటువంటి దోసగు మన నాటకరంగంలోకి జొరపడకుండా మనము కాచుకోవలెనని మనము విమర్శించుతున్నాము. మనమా విధముగా భావించి మన నాటకరంగ మావిధంగా మారిపోకుండా వుండడానికి ప్రయత్నం చెయ్యడంలో తప్పేమీ లేదు కాని అరవ నాటకరంగాని కీ విధంగా పరిణామం వచ్చింది కాదని విచారించవలసిన అగత్యమంతగా లేనట్లు తోస్తుంది. వారు సహజంగా సంగీతముగ్ధమైన జాతికనుక వారారీతిని తప్ప మరోవిధంగా వుండడానికి సాధ్యం కాదేమో. పాశ్చాత్యనాటకరంగాలతో పోల్చిచూస్తే వారు వెనకపడి వున్నట్లు కనిపించినా, వారిపాటలూ బాగుంటాయి, జాతీయంగా వుంటాయి, రసవంతంగానూ వుంటాయి. ఇట్లా వుంటున్నప్పుడు వారికా నాటకరంగం సరిపడిందనీ, దానిలోనుంచి మరోవిధంగా వారు మారలేకపోవడంలో ఆశ్చర్యం లేదని మన మనుకోవాలి. అయినా పాశ్చాత్యకవులు వ్రాసిన నాటకముల వంటి సాంఘిక నాటకములకు వారి సాహిత్యంలో కొదవలేదు సంబంధముదలియారుగారు అటువంటి నాటకాలను కొన్నింటిని వీరేశలింగం పంతులుగారి లాగే వ్రాశారు. వానిని పాశ్చాత్యసాహిత్యాభిమానులు వాలుకుర్చీలలో కూర్చుని చదువుకోవడమే తప్ప నాటకరంగం మీదికెక్కిస్తే చూచి మెచ్చుకొనేవారు మనలో లాగే తక్కువలాగ కనిపించుతుంది. ఇంతకూ కేవల సాంఘిక నాటకాలు వారిలోను మనలోనుకూడా ప్రహసనాల అంతస్తును దాటి అంతకన్న ఉన్నతమైన అంతస్తుకు చేరినట్లు కనిపించదు. ఇట్టి నాటకాలు పాశ్చాత్యులకు రుచించినట్లు మనకు రుచించజాలవే అనుకోవాలి. మనకు నాటకమే కాని, పద్యమే కాని, కవిత్వమే కాని, నృత్యమే కాని ఒక ఆధ్యాత్మిక భావమును కూడా ముద్రించి ప్రకటించితే కాని యేదో ఒక వెలితి వున్నట్లు కనిపించుతుంది. వారికి సంఘము, సంఘోద్ధరణము, సంఘ ప్రతిబింబము కంటె ఉన్నతమైన ఆదర్శ మావశ్యకమైనట్లు తోచదు.

ఆంధ్రనాటక కళాపరిషత్తువారు సాంఘిక నాటకం వ్రాసిన వారికి వేయినూటపదహార్లిస్తామని ప్రకటించినారు. చాలా సంతోషకరమైన మాట. సాంఘిక నాటకమంటే సంఘసంస్కారము నుపబోధించవాలని, సంఘసంస్కారమంటే సంఘములో వుండే కుళ్లంతటినీ చాకిరేవులలో లాగ నాటకరంగంలోనూ సాహిత్యంలోను వుతికిపోసి చూపరులకు రోతపుట్టించి తన్మూలకంగా వారికి ఉత్తమసంస్కారం తేవడమని మన అభిప్రాయమై వుంది. అందుచేతనే మన కాలేజీగర్లు, కాలేజీస్కాండ్రలు, తప్పెవరిది మొదలైన నాటకాలన్నీ పురిటిలో ఎన్నెమ్మకొట్టేసి బద్దలలాగ నాసంగా వుండి ప్రేతకళల నోడుతున్నవి. కుళ్లులేని సంఘం అంటూ వుండదని మనము గ్రహించుకోవాలి. ఆకుళ్లును రంగంమీదికి తీసుకొని వచ్చి ఏహ్యం పుట్టించడం కోసం ప్రయత్నం చెయ్యడంలో కూడా తప్పేమీ లేదు. కాని అందుకోసమే పద్యాలు రాయడం నాటకాలాడడం జరగకూడదు. నాటకరంగం ఒక జాతి యొక్క ఉత్తమలక్షణములను ప్రదర్శించి ప్రజల నుత్తమలక్ష్యంగలవారినిగా చేయుటకే నిర్ణయింపబడ్డది. కుళ్లును ప్రదర్శించడం మన ముఖ్య ప్రధానమైన పనిగా పెట్టుకోకూడదు. ఉత్తమలక్షణాలకు కొంత వెనకతట్టున పెట్టి ఈకుళ్ళుయొక్క చీకటి తెరమీద ఆ చక్కని వెలుతురు మరింత తేజోవంతముగా కనిపించేటట్లు వేయుటయే ఆకుళ్ళు ప్రదర్శించడం యొక్క ప్రయోజనమని మనము గుర్తించవాలి. ఈ విధమైన ఆశయమును మనము పెట్టుకుంటే మన సాంఘిక నాటకాలు ఇప్పుడున్నంత అవకతవకగా ఎన్నటికీ వుండవు.

మనజాతిలో ఉత్తమలక్షణాలు ఉత్తమనాయకులు నాయికామణులు లేరని మనము తలచుకోరాదు. ఆవిధంగా కవీశ్వరులే తలచేటట్లయితే యెన్ని నాటకాలు వచ్చి మనకే మాత్రం సంస్కరణమునూ ఒసగలేవు. మనమొక ఉత్తమమైన జాతివారమని, మనలో ఉత్తములైనవారి జీవనములను వారి సంప్రదాయములను ప్రదర్శించి మన జాతిని ఉత్తమలక్ష్యవంతులుగా చేయగలమని మన కవీశ్వరులు నమ్మి ఆవిధమైన నాటకములు వ్రాయగలశక్తి తమకు రావలెననియే నాట్యకళాధిదేవత నుపాసించవలెను. నాయికా నాయకులున్నతోన్నతలక్షణ సమన్వితులైన ధీరోదాత్తులుగా వుండవలెను. మానవజన్మవశమున సంటుకొను ఒకటిరెండు లోపములు వారిలో నుండవచ్చును. ఆలోపముల నాశ్రయించుకొనియో, లేక వారి సుగుణముల నాశ్రయించుకొనియో ఒక ప్రదర్శనీయమై గుణపాతబోధకమైన చరిత్ర వారిజీవితమునుండి వెలువడును. కవీశ్వరుడు దానిని తీసుకొని తనగంభీరమగు లేఖినినుండి ఉన్నతమగు భావములను పద

రూపమునకో పద్యరూపమునకో గేయరూపమునకో అల్లి గద్యనాటకమునో గద్యపద్య నాటకమునో గద్యపద్యగేయ సమన్వితనాటకమునో రచించి ప్రదర్శించుడని నటకుల హస్తముల కర్పించును.

నాటకము మన చుట్టుపట్లనుండెడి సామాన్య ప్రపంచమునకు సామాన్య మానవకోటి చర్యలకు కూడ ప్రతిబింబమై వుండవలెను. అది కేవలము ఉత్తమ పాత్రల గుత్తకాదు. కేవల ముత్తమ పాత్రలతోను ఉత్తముల చర్యలతోనూ నిండివుండేలాగుంటే అది ప్రపంచకానికి సరియైన ప్రతిబింబము కానేరదు. ప్రపంచకానికి దానికి వుండే ఉత్తమాకారమో అధమాకారమో ఉత్తమమధ్యమాధమ మిశ్రమాకారమో యిచ్చినప్పుడుకు ఉత్తములెంత బాధ్యులైయున్నారో అధములును అంతకారకులైయున్నారు. వారు లేకుంటే అసలు ప్రపంచమూలేదు, నాటక మంతకన్నా లేదు. అయినా వారిని ఎత్తితీసుకొనివెళ్లి ఉత్తమపాత్రల నెత్తిమీద కూర్చోపెట్టడముకాని, అసలుత్తమ పాత్రలు లేకుండానే చేయడంకాని, ఉత్తమపాత్రలు నేర్పుగల నీతి తత్త్వములను వీరిగందరగోళములో మఱుగు చేసివేయడంకాని ఉత్తమరచనయొక్క లక్షణముకాదు. ఆంగ్ల నాటక కవిచక్రవర్తియగు షేక్స్పియరు తన నాయికా నాయకుల నెల్లరను అల్పలోప సమేతులగు ఉత్తమపాత్రలుగాచేసి, సామాన్య మానవుల చర్యలను లోపములను మధ్యమాధమ పాత్రలకు తగిలించి అసలు నాయకుల చరిత్రలను ప్రధాన నాటకముగాచేసి తక్కిన వారి చర్యల నంతర్నాటికగా (Bye plot) గాచేసి రెండుప్లాటులను నడిపించి కలిపి ఒక అద్భుతమైన పరిణామమును తెచ్చి నాటకముయొక్క ఉత్తమత్వమునకు గాని సామాన్యత్వమునకుగాని దేనికి భంగమురాకుండా జాతియొక్క ఉత్తమ సామాన్యలక్షణములకు రెండింటికీ ప్రతిబింబంగా వుండేటట్లు చేసినాడు. అతని కథలూ పాత్రలూ ఏదేశమునకు ఏకాలమునకు చెందినవైననూ సరే అతనీ సూత్రములనే అవలంబించి నాటకములు వ్రాసి ప్రతీ నాటకమునూ ఏదో ఒక జాతియొక్క లక్షణములకు ప్రతిబింబముగాను, సమస్త నాటకములను ఏదోయొకరీతిగా విశ్వమానవ జాతియొక్క లక్షణములకు ప్రతిబింబములుగాను ఒనరించినాడు. కనుకనే అతని నాటకాలను పిండితే వానిలోనుండి విశ్వమానవ సౌందర్యం చిప్పిలుతూ వుంటుంది. కాని అంతటితో పాశ్చాత్యుల ఆశయం సరి. అందుచేతనే వారు శుద్ధమైన సాంఘిక నాటకాలను రచించి ప్రదర్శించ గలిగినారు.

కాని మనదేశమును జాతిని ఉత్తమత్వమునకు సామాన్యత్వమునకు అతీతమైన ఒక ఆధ్యాత్మిక తత్త్వముకూడా పీడించుకొని తింటున్నది. ఎన్ని పాశ్చాత్య వాసనలువచ్చి మనల నలుముకుంటున్నా ఈతత్త్వమువకటి మన పండితపామరుల నెవరినీ విడచిపెట్టిపోకుండా వున్నది. అది ఒక పుణ్యమే అనుకోవాలి. పాశ్చాత్యులు ఉత్తమత్వము నుపాసించి అందుకోలేక యెట్లా క్రిందామీదా పడుతున్నారో, మనమూకూడా ఈ ఆధ్యాత్మిక తత్త్వము నుపాసించి అందుకోనే వాళ్లందుకొని లేని వాళ్లందుకోలేక క్రిందామీదా పడుతున్నాము. నిజమైన భారతీయ కవీశ్వరుడూ భారతీయ కళాకారుడూ అయితే ఈసమస్యను తృణీకరించి కవితలూ చెప్పలేరు నాటకాలూ వ్రాయలేరు. అథవా వ్రాసినా ప్రజలు ప్రహసనాలను తమాషాలను పాశ్చాత్య సినీమాలను టాకీలను చూసినట్లు గమ్మత్తుగా చూస్తూ సిగరెట్లు కాల్చుకుంటూ కూర్చుంటారేకాని ఎట్టి విశిష్టమైన నీతినీ, నిర్మలత్వమునూ, వీరత్వమునూ, ప్రతిభనూ గణించి వంటికి పట్టించుకోరు. అన్నివిధములైన కళలవలె మననాటక కళనుకూడ కవీశ్వరులోక ఆధ్యాత్మిక దృష్టితో ఉపాసించవాలి, వ్రాయవాలి, ప్రదర్శించవాలి, సంఘములోవుండే ఉత్తమ మధ్యమ అధమలక్షణములను దానికి అనుకప్రక్క హంగుగామాత్రమేవుంచి అసలు ప్రాముఖ్యత నంతటినీ దీనిపైని కేంద్రీకరించవాలి. అప్పుడు మన నాటకాలు మన సంఘము నేమాత్రమైనా కదిలించి ఉత్తమ సంస్కారము నీయగలుగుతాయి. లేకుంటే నటకులకు గొంతుక దండుగ, కంపెనీల వారికి ఎస్టాబ్లిషుమెంటు దండుగ, కవీశ్వరులకు కాగితాలు సిరా దండుగ, ప్రేక్షకులకు డబ్బుదండుగతప్ప, వాటివల్లన సజాతీయతా సిద్ధించదు, దేశమునకు సంస్కారమూ సిద్ధించదు. సంస్కారము సంస్కారమంటే మన సంఘంలోవుండే ఆయా యీ లోపములను పట్టుకొని తిట్టి చెఱిగి యెగరపోసినంత మాత్రమున సిద్ధించదు. రవీంద్రుడీ రహస్యమును గుర్తించిన సిద్ధహస్తుడు గనుకనే అతని నాటకములు ఆధ్యాత్మిక తత్త్వముతో ఒకవరసన అల్లుకొనివుండి, ఉత్తమ పాత్రలతో ఒకమూల మూగుకొనివుండి, మధ్య మాధమ పాత్రలతోకూడ అక్కడక్కడ మిళితములైయుండి ప్రపంచమునకెల్ల సర్వసామాన్యమైన ఉత్తమమధ్యమాధమత్వ లక్షణముల నొక ప్రక్కన ప్రతిబింబించుమనేగాక, వీనికతీతమైన భారతజాతీయతా విశిష్టమైన ఒక ఆధ్యాత్మిక తత్త్వమును గూడ వెలిగ్రక్కుచు నిజమైన భారతజాతీయతా ప్రతిబింబకములై సర్వజగన్మోహనములై కూడా ఉన్నవి. ద్విజేంద్రుని నాటకములలో గూడ ఇట్టి చాయలే పొడగానవగును.

ఆంధ్ర నాటకములలోకూడ పాత్రపోషణము పొందలగు వానియందు కొన్ని కవి సహజములగు లోపములున్నను ఈ మూడు పాళ్లకును యెంతోకొంత ప్రాతినిధ్య ముంటున్నది. మధ్యమాధమ పాత్రములకు చాలా తక్కువస్థానము వచ్చుటయు, ఆధ్యాత్మికము నేదో బలవంతముమీద జొప్పించినట్లుండుటయు, ఉత్తమ పాత్రల నసహజమానవాతీత లక్షణోపేతులుగ నొనర్చుటయు వానిలోని కొన్నిలోపములై యుండవచ్చును. కథలు సర్వసామాన్యముగా పౌరాణికము అగుటయు చారిత్రక సాంఘిక కథలమీదికి కవుల దృష్టి మరలకుండుటయు మరియొకలోపమై యుండవచ్చును. ఈ లోపములు సవరింపఁ బడవలెనన్న కవీశ్వరులు చారిత్రక సాంఘిక కథలనుకూడ తమ నాటక సామగ్రిగా గ్రహించక తప్పదు. అంతమాత్రమున ఆధ్యాత్మికత్వమునకు స్వస్తిచెప్పినచో అది భారత

జాతీయ జీవనమునకు ప్రతిబింబము కానేరదు. అధమ పాత్రలకు దురాచారములకు కూడ కొంత తావిచ్చి సంస్కరణావశ్యకత నిరూపించకున్నచో నిత్యజీవనమునకు ప్రతిబింబము కానేరదు. ఉత్తమ నాయికా నాయక శూన్యమైనచో అట్టి నాటకములను ప్రదర్శించు టకంటె ప్రదర్శింపకుండుటయే మేలు. చారిత్రక నాటకకర్తలు కాని సాంఘిక నాటకరచయితలు కాని యీ సూత్రములను దృష్టిలో నుంచుకొని ధ్యానించి రచనమునకు గడంగినచో, నటకులు ప్రదర్శించినచో ఆంధ్రనాటక రంగమునకును ఆంధ్రజాతికిని అమూల్యమగు సేవ నొనరించిన వారగుదురు.

చారిత్రక సాంఘిక నాటక రచనమునకు మనము పూనుకున్నంత మాత్రమున పౌరాణిక నాటకములనుగాని, భాగోతములనుగాని, యక్షగానములనుగాని, బొమ్మలాటలనుగాని, హరికథలనుగాని, వీధినాటకములనుగాని, రేలపాటలనుగాని బహిష్కరించనక్కర లేదు. ఉత్తమనాటకము లనుకొనబడు శాకుంతల, ఉత్తరరామచరిత్ర, వేణీసంహారము, విక్రమోర్వశీయము మొదలగునవి యెట్లో అట్లే పై ప్రదర్శనములును మన ఆంధ్రనాట్యకళ యొక్క వివిధాంగములై యున్నవి. వీనిలో నేయంగము తెగి రాలిపోయినను అంతవరకు మన నాటకకళాధిదేవత కుంటిదో గ్రుడ్డిదో యై అదర్శనీయ యగును. పాశ్చాత్యదేశములలో ఒకకళ లేక పరిణామము రాగానే దాని క్రిందటి కళలేక స్వరూపము నాశనమగుచున్నది. దానిని గూర్చి మనము నేర్చుకొనవలెనన్నచో మ్యూజియములోనికి వెళ్లి ప్రాత పుస్తకములు, బొమ్మలు, దుస్తులు, ఆయుధములు చరిత్రలు పరిశీలించి తెలుసుకొని జ్ఞాపక ముంచుకొనవలెనే కాని నిత్యజీవనములో వాటి గ్రుక్కు మచ్చెక్కడా వుండదు. ప్రాతది మఱచిపోయి క్రొత్తదిగా మారిపోవడమే పరిణామధర్మమనియు, ఇట్టి పరిణామమే సృష్టికి సార్థకమనియు వారి సంకల్పము. మనకు సృష్టిలో ప్రాతదంటూ లేదు. ప్రతిదీ నిత్యనూతనత్వము నొందుతూ వుంటుంది. వేదయుగము నాటి ఉపచ్ఛాయలు మనకు క్రీ. శ. ౧౯౩౫ లో కూడా తూర్పున కనిపించకపోతే తృప్తి వుండదు. వాల్మీకి మన కళ్లయెదుట యింకా పుట్టలు దులుపుకుంటూ రామాయణరచన ప్రారంభిస్తున్నట్లే వుంటాడు. కణ్వమహర్షి ఆశ్రమాలు ఇంకా కనిపిస్తాయేమో అని మన మింకా తడుముకుంటూ తీర్థయాత్ర చేయగోరుతాము. ఎన్నాళ్ల క్రిందటి మన పూర్వీకులో మన ప్రవరలు గోత్రాలు తలుచుకోకుంటే మనకు అన్నాలు సహించవు. మన దృష్టి వర్తమానమునందెంత ముడిపడుతూ వుంటుందో, భవిష్యత్తు నెంతదూరమువరకు ఆశిస్తూ వుంటుందో భూతములోకి కూడా అంతదూరము నిగిడి వుంటూ వుంటుంది. సృష్టిలో మనకు ముక్కలు, కంపార్టుమెంటులూ, గదులూ లేవు. అంతా ఒక సంపూర్ణమైన ఏకత్వము. భిన్నత్వమన్నది అజ్ఞానజనితమైన ఒక సంతోషము, లీల. ఆలీలకే వివిధభిన్నములు వివిధాంగములు. జ్ఞానదృష్టితో తప్ప అజ్ఞానదృష్టితో దానిని చూడడమంటే మన కసహ్యము.

ఉదాహరణమునకు ఆంగ్లనాటకరంగమును తీసుకొందము. ఇప్పటి ప్రసిద్ధనాటకప్రణేతలు బెర్నార్డుషా, ఇబ్సను మొదలగు వారు. వీరు లిఖించుచున్నట్టియు ప్రస్తుతరంగముమీద నటింపబడు తున్నట్టియు నాటకములు అంతకు ముందటి నాటకరచనానైపుణ్య కళను అడుగంటచేసినవి. అవి అంతకుముందటి షెరిడను, డ్రైడను మొదలగువారి నాటకరచనాకళను త్రొక్కివేసినవి. అవి అంతకు ముందటి షేక్స్పియరు మొదలగువారి నాటకములను దిగత్రొక్కి వాటిమీద నిలచినవి. షేక్స్పియరు బెంజాన్సను మార్లో మొదలగు వారల విధానమునకు గ్రహణము పట్టించినాడు. వారు నీతినాటకముల (Morality Plays) ను చెండినారు వారు యక్షగానములు (Ballad dances) ను ఎత్తిపెట్టివేసినారు. ఇప్పటి నాటకరంగము యొక్క పరిణామము ఇన్ని విధానముల శవములమీద సాధారపడి యున్నది. దీని పుట్టుపూర్వముల నెరుగవలెనన్న యెన్నో ప్రాత పుస్తకములను విమర్శనలను చదువుకోవలసినదే తప్ప దర్శించుటా మంటే కనిపించవు. అదీ పరిణామమంటే అర్థము. అట్లే గ్రీకులేటిను నాటకముల చరిత్ర కూడా వున్నది. ఆమోస్తరుగా ఇప్పుడెవ్వరూ వ్రాయరు, వ్రాస్తే హర్షించరు. మనదేశములో అట్లా పరిణమించ లేదు. ప్రాతపద్ధతిని మన మెప్పుడూ దండెము పెట్టి సాగనంపము. ఒకదగ్గర గౌరవస్థాన మిచ్చి కూర్చోపెట్టి, అన్నితాపత్రయాల తోనూ పాటు దానిని కూడా ఒకమాటు చూచుకుంటూ మన పూర్వు లిట్లాటివారి గదా యని అనుకొని జ్ఞానముతో ఆనందిస్తూ, భవిష్యత్తు వైపు దృష్టి సారిస్తూ మన ఆత్మయొక్క సంపూర్ణత్వముయొక్క ప్రతిబింబము నీ లీలాప్రపంచములో దర్శిస్తూ పరవశత్వము నంద గోరుతాము. ఈ సంపూర్ణత్వము మనకు వివిధములైన యీ కళల యొక్క దానిలోనూ పూర్తిగా అగుపించి వూరుకోదు, ప్రతిదానిలోనూ కనిపించుతుంది, అన్నింటిలోనూ కలిసి మరీ అగుపించుతుంది. అందుచేతను మనము యెన్నడూ ఒకదానియందుండే పక్షపాతము వల్ల ఇంకొకదానియందుండే మాధుర్యమును మరచిపోవద్దు.

(మామిత్రులు సత్యనారాయణగారు యుక్తసమయంలో చేసిన యీ శుభప్రారంభాన్ని పురస్కరించుకుని మేము నాటకకళను గురించి చర్చకి అందుకుంటున్నాము. ఈవిషయంలో కూడా ప్రబుద్ధాంధ్రకు కవులూ, పండితులూ, విమర్శకులూ, నటులూ లేఖలు పంపగోరుతున్నాము.

సంపాదకుడు)

# మళ్లీ స్వాధీనపరుచుకోవలసిన లలితకళ

అరుణోదయం మొదలు పొద్దు గూకేదాకా మన యిళ్లల్లో అంట్లూ చెంబులూ తోమి, ఇల్లూ వాకిలీ తుడిచి, బట్టలుతికి, దీపాలకు చమురు పోసి, బిడ్డల నాడించి—నానాచాకిరీ చేసి, చివరికి మన ఉచ్ఛిష్టం తినే యానాది వడుచు తన గుడిసెకు పోయి తనవారితో కలిసి 'తథిమిత' అని వొళ్లు మరిచి నృత్యం చేసి మనస్సుకి ఉల్లాసమూ, హృదయానికి ఉత్తేజనమూ కలిగించుకొని విలాసంగా— హాయిగా నిద్రపోతుంది. కాని మన దృష్టిలో అదిఅనాగరికత. మోటతనం. అడవిమనుష్యుల పని.

మనకు కాని; మనకి కూడా నృత్యం అంటే యిష్టం లేకపోలేదు. అయితే ఆ అభిలాష రేకెత్తినప్పుడు ఏ వేశ్యనో పిలిచి, ఆడించి, ఆనందించడమే కాదు ప్రపంచాన్నుద్ధరించేసినట్టు గర్వపడతాం.

నృత్యం అధమవిద్య అని మన నిశ్చయం.

ప్రపంచంలో తక్కిన అన్నిజాతులవారినీ చూడండి. వారందరూ నృత్యం అంటే చెవి కోసుకుంటారు. పోనీ, మన భరతశాస్త్రం చూడండి. నృత్యం ఉత్తమోత్తమమైన లలితకళ. అందాకా యెందుకూ? విరాటపర్వం తియ్యండి. అర్జునుడు నృత్యోపాధ్యాయుడు. ఉత్తర మొదలయిన రాజపుత్రికలు నృత్యం నేర్చుకున్నారు.

నృత్యం బ్రహ్మానందానుభూతికి ఒక ప్రధానసాధనమని మన జాతీయవాఙ్మయం కంఠోక్తిగా చెబుతోంది. మన చరిత్ర చేయెత్తి చూపిస్తోంది.

అలాంటి కళని మనము ఈసడించాము. అశ్రద్ధ చేశాము. మరిచిపోయాము.

అయితే: అది వెనకటిమాట. మన మిప్పు డేమిటి చెయ్యడం?



నృత్యవిద్య సభ్యతకి నికషం అని బోధపడింది. కనక దాన్ని మళ్లీ మనం స్వాధీనపరుచుకోవాలి. భుక్తపరుచుకోవాలి.

వేశ్యలు వ్యభిచరిస్తున్నారని వారిని బట్టి మనము ఈవిద్యనుకూడా పాడుచేసుకొన్నాము. ఇలాంటి లలితకళను ఒక్క మనమే నిర్లక్ష్యం చేశాముగాని మరెవ్వరూ చెయ్యలేదు. అయినా యిప్పుడేనా మించిపోయింది లేదు. నృత్యంయొక్క విశిష్టత యిప్పటికేనా మనవారు గ్రహించినందుకు చాలా సంతోషం.

గుంటూరు నందలి శారదానికేతనమూ, రాజమహేంద్రవరము నందలి వైశ్యసేవాసదనమూ, స్త్రీసనాతనవిద్యాలయమూ, కాకినాడయందలి విద్యార్థినీసమాజమూ ఇంకా యిలాంటి సంస్థలూ ఈకళను మన బాలికలకు నేర్పవలసివుంది. ఈ కళని మన మెంత త్వరగా పూజిస్తే అంత తొరగా మనకి సభ్యత సిద్ధిస్తుంది.

—కళాప్రియుడు

* * *

# రఘుపతి వేంకటరత్నం గారు

చింతా దీక్షితులుగారు బి. ఏ. ఎల్. టి

ఆయన్ని పరిచితులూ, బంధువులూ, శిష్యులూ నాయుడుగారనే అంటారు. కొందరు ప్రినిసిపాల్‌గారంటారు. ఆయనకు దూరంగా ఉండేవారు, మహర్షి, దివాన్ బహద్దరు, డాక్టర్, సర్ ఇత్యాదిఉపసర్గలతో పిలుస్తారు. మరీదూరంగా ఉండేవారున్నూ, ఈబిరుదులే గొప్పతనము నిస్తవని భ్రమపడేవారున్నూ, పై ఉపసర్గలతో యం. ఏ., ఎల్. టీ., ఎక్సు వైస్‌ఛాన్సెలర్, వగైరాలతో పాటు జోడించి పేరు పలుకుతారు.

ఆయనకు అక్కర్లేని, ఆయన తృణీకరించే ఘనత ఆయనికి అంటకట్టదలచే ఆప్తులున్నూ పైవిధంగా వలకడం కద్దు. అనోటితోనే నాయునగారనడం కూడా కద్దు. రఘుపతి వేంకటరత్నం అంటేనే నాయుడిగారికి ఎక్కువ ఇష్టం అనుకొంటాను. గొప్పతనమును తృణీకరించడంలోనే ఉన్నది నాయుడిగారి గొప్పతనం. ఆయన ఘనత కోరలేదు. పేరు కోరలేదు. ఆయనకు ఘనతా పేరూ వచ్చినవి. ఆయన కర్మవీరుడు; భక్తుడు.

౨

ఉదయం, నాయుడుగారిల్లు. నాయుడుగారు లోపల ఏంచేస్తున్నారు? ఎర్రబట్ట గూడకట్టు కట్టుకొని పుస్తకాలు తిరగవేస్తున్నారు. ఎట్టి పుస్తకాలు? విజ్ఞానప్రదములైనవి—భక్తిని పురిగొల్పేవి. లేదా వచ్చినవారితో ప్రసంగిస్తున్నారు. ఎందును గురించి! భగవంతుణ్ణి గురించి.

మధ్యాహ్నం. నాయుడుగారేంచేస్తున్నారు? మహాకవుల ఆదేశం గ్రహించుకొంటున్నారు. తత్త్వవేత్తల హృదయం పట్టి చూస్తున్నారు. దీనులకు సుఖము కలిగించే ఉపాయాలు వెదుకుతున్నారు.

సాయంత్రం. నాయుడుగారేంచేస్తున్నారు? భక్తిప్రసంగాలు చేస్తున్నారు. దీనుల అవస్థలు తలుచుకొని జాలి పొందుతున్నారు.

రాత్రి. నాయుడుగారేంచేస్తున్నారు? మనస్సు నేకాగ్రము చేసుకొని పరబ్రహ్మపై నిలుపుకొంటున్నారు.

అర్థరాత్రి. నాయుడుగారేంచేస్తున్నారు! నిద్రపోవడం లేదు. ధ్యానమగ్నులై ఉన్నారు.

౩

నాయుడుగారు కాలేజీ ప్రినిసిపాల్. అవి పరీక్షరోజులు. దరఖాస్తు డబ్బు తెచ్చుకోవాలని నాయుడుగారి ఉత్తరువు. గడువు దాటరాదు. విద్యార్థులలో గడువు తప్పకుండా డబ్బు తెచ్చుకొన్నవాళ్లు చాలామంది ఉన్నారు. కొందరు కొంతడబ్బే తెచ్చుకోగలిగారు. కొందరు ఎంత తంటాలుపడ్డా ఏమీ తెచ్చుకోలేకపోయారు.

ఇక రెండురోజులు గడువిస్తే అందరూ తెచ్చుకుంటామన్నారు.—ఇంట్లో వస్తువులు తాకట్టుపెట్టి కొందరు, భూములు అమ్మి కొందరు, పత్రములు వ్రాసి కొందరు, ఏదో ఒక విధంగా తెచ్చుకొంటామన్నారు. నాయుడుగారు గడువు దాటడానికి వీల్లేదన్నారు. ఎంతకఠినుడు! పూర్తిగా తెచ్చినవాళ్ల దగ్గిర డబ్బు వసూలైనది. సగము తెచ్చినవాళ్లదగ్గిర సగండబ్బే వసూలయింది. లేనివాళ్లదగ్గిర ఏమీ వసూలుకాలేదు.

పరీక్షకు పంపరేమో నని వీళ్ళు కంట నీళ్లు కారుస్తున్నారు.

గడువు దాటకుండా దరఖాస్తుడబ్బు పైకి వెళ్లింది. అందరూ పరీక్షలకి వెళ్లవచ్చును.

ఎవరు కట్టారు కొరతడబ్బు? నాయుడుగారంటే నాయుడుగారని పిల్లలలో పుకారు పుట్టింది.

౪

తల్లిని బాసిన ఈపిల్లలకు ఈసౌఖ్యమిస్తూన్నది ఎవరి డబ్బు?

భర్తను పోగొట్టుకొన్న భార్య కన్నీళ్లు నరికట్టుతున్నది ఎవరి మాట?

ఆమెకు ఆశ్రయ మిచ్చింది ఎవరి హృదయం?

బీదలను విద్యావంతులుగా చేస్తూంట ఎవరి ఆశీర్వచన పురస్కృతమైన డబ్బు?

పతితులను సేవనొత్తడానికి ఎప్పుడూ చాచి ఉంచిన ఉదక్షిణహస్త మెవరిది ?

బీదజనము ను చూచి తన అసామర్థ్యమును నిందించుకొంటూ నిరంతరమూ కన్నీరు కారుస్తున్న దెవరి కన్ను ?

పతితుల సేవ పరమాత్మ సేవ అని భావించుకొంటూ ఉన్న ఉహృదయ మెవరిది ?

—నాయడుగారిది.

౫

నా దేవుణ్ణి పూజించడం లేదని నేను నీతో తగాదా. నీ దేవుణ్ణి పూజించడం లేదని నీవు నాతో తగాదా. ఈ తగాదాలతో కాలం గడిచిపోతోంది. ఏ పేరుతో పూజించినా ఎలాగ పూజించినా పూజ పూజే. ఎవరిభక్తి ఎటువంటిదో చూచుకొనే శక్తి భగవంతుని కున్న దనే జ్ఞానం మనకు లేదన్న మాట.

నాయడుగారు విగ్రహారాధన పనికిరా దన్నారు. ఉఒక అవగుణము లోనూ ఆయన గుణజాల మంతా కొట్టుకొనిపోయిన దని కొందరి ఊహాలో.

నిరంతరమూ మనస్సును భగవదున్ముఖము చేసుకొంటూన్నప్పటికీ ఆయన భక్తుడు కాడు వారి ఊహాలో.

౬

భగవంతుణ్ణి పిలిచిపిలిచి కాయలు కాచిన ఆయన నోరు పవిత్రము.

పతితులకూ దరిద్రులకూ చోటిచ్చి చోటిచ్చి ఆయన హృదయము విశాల మైనది.

ఆర్తుల కన్నీళ్లు నిండించిన ఆయన డబ్బు ధన్యమైనది.

ఆంధ్ర దేశసేవకూ మానవసేవకూ అర్పించబడుతూ ఉన్న ఆయన శరీరం ధన్య మైనది.

అట్టి పుత్రరత్నమును కన్న తెలుగుతల్లి ధన్య యైనది.

☞ నాయుడుగారి చిత్రఫలకం దయచేసి మాకు సాయపడిన డాక్టరు శ్రీ వేమూరి రామకృష్ణారావుగారికి మేము కృతజ్ఞులము.

సంపాదకుడు)

---

## కవులకూ వ్యాసకర్తలకూ విన్నపం

౧ ప్రబుద్ధాంధ్రకు ఎవరూ పద్యాలు పంపవద్దు.

౨ వచనంలో నైనా వ్యాసాలు చిన్నవిగా ఉంటే మంచిది.

౩ సంఘాచారాలూ, లలితకళలూ, చారిత్రికాలూ, ఆర్థికాలూ, పారిశ్రామికాలూ,—ఇలాంటి విషయాల మీద వ్యాసాలూ, చర్చలూ, విమర్శలూ తరుచు కావాలి.

౪ మహాపురుషుల (ఆంధ్రుల) చరిత్రలూ, వారిని గురించిన సమీక్షణాలూ కావాలి.

౫ చిన్నకథలూ, స్కెచ్చిలూ, ఏకాంకనాటకాలూ, ప్రహసనాలూ కావాలి.

౬ వివిధదేశాల — వివిధసంఘాల — వివిధమతాల వర్తమానస్థితిగతుల వివరాలు కావాలి.

కవులకూ, వ్యాసకర్తలకూ వారి రచన పడిన సంచిక మొదలు పన్నెండు సంచికలు పంపుతాము. తరుచు రాసేవారికి ఎప్పుడూ పంపుతూ వుంటాము. మేము వారికి చెయ్యగల సత్కారం ఇంతే.

## రెవ్యూకోసం పుస్తకాలు

ప్రబుద్ధాంధ్రకు రెవ్యూకోసం పుస్తకాలు పంపేవారు రెండేసి ప్రతులు—ఒకటి రెవ్యూ చేసేవారికీ, ఒకటి పత్రికా భాండాగారానికీ- పంపాలి. ఒక ప్రతే వచ్చే పుస్తకాలను గురించి రెవ్యూ ప్రకటించడం ఆలస్యం కావచ్చు. రెవ్యూ రాయబడకపోవడం కూడా తటస్థించవచ్చు. రెవ్యూలు సమర్థులచేతే రాయిస్తాము. వాటిమీద పునర్విమర్శలు ప్రకటించలేము.

సంపాదకుడు

# అ ప శ్రు తి

శ్రీ విశ్వనాథకవిరాజుగారు

[రాత్రి ౯ గం॥ సాధారణపు గది. అదే సామాను కొట్టూ పడకగదీ కూడా కావడంచేత ఇల్లు కుశలమనీ ఇంటివాగు సంసారులనీ తెలుస్తుంది. అసలున్నవారు ఫోక్తు ఇస్తోకు. అందులో రాజారావుగారు సెకండ్ హాండు ఏక్టరు; దామోదరుడు పెర్మనెంటు—భవానీ శంకరుడు కొన్నిసార్లు ఏక్టింగ్ చేసినాడుకూడా. కంట్రాక్టుమీద ఆట కాగు దగ్గరనుంచీ పుచ్చుకొంటాడు. వయసు ౨౫ సం॥ రాణీ కృష్ణవేణి వయసు ౨౦ సం॥ మంచి బందోబస్తు. 'నాతిస్థూలా, నాతికృశా, నాత్యుచ్చా, నాతివామనా' అందకత్తె. అందంలో యవ్వనం వంతు చాలా యెక్కువ. లుంగీ బనియన్ ధరించి మంచం ప్రక్క రంగారావొక్కడూ నిల్చి వున్నాగు.]

రంగారావు—(నోట్లో చుట్ట పెట్టుకొని) అగ్గిపెట్టె... అగ్గిపెట్టె కావాలి......వినబడ్డాదా ?......

(లోపలనుంచి అగ్గిపెట్టె వచ్చి టక్కున
పాదాల దగ్గిర పడుతుంది.)

(తీసిచూసి) అరే! ఇందులో పుల్లలులేవు మరోపెట్టె లేదూ ? ఏదీ! ఆబుడ్డీదీప మొక్కమూ రిటుపెట్టు.

(గుమ్మంమీదికి బుడ్డీదీపం వస్తుంది. తీసి చుట్ట అంటిస్తూ వుంటే ఆరి పోయింది.)

చచ్చినానురా భగవంతా! నాబ్రదు కెలాగుందో ఇదీ ఆలాగే వుంది. (కాగితం చుట్టి హారికేన్‌లాంతరు త్తి అంటించి బుడ్డీదీపం వెలిగించి యీసారి భయంతో చుట్ట ముట్టించుకొని బుడ్డీ లోపలకు దించి ఆప్యాయంగా రెండు గుక్కలు తీస్తూ) ఎల్లా తెల్లవారు తుంది? వెళ్లి ఓపెట్టె కొనుక్కొని వస్తాను.

(కొత్త అగ్గిపెట్టె వచ్చి పడుతుంది.)

ఇదెక్కడిది ?

(లోపలనుంచి)

మరచిపోయినాను. మొన్న తెప్పించినాను.

రంగారావు—బాగుంది.

కృష్ణవేణి—(మాసిన చీర కట్టుకొని ఒకచేత మజ్జిగ గిన్నె పట్టుకొని రెండవచేత చెరగుతో మూతి తుడుచు కుంటూ వస్తుంది)

రంగా—అప్పుడే భోజన మయిపోయిందీ ?

కృష్ణ—ఆ

రంగా—ఈ రెండు నిముషాల్లోనే ? ఏం తిన్నావు ?

కృష్ణ—నాకు కావలసింది.

రంగా—ఏలాగు చావడం? ఆ, అంటే తప్పా- ఊఁ అంటే తప్పు. ముక్కుమీద నుంటవి కోపాలు. పల్లెత్తు మాటంటే బ్రహ్మాండమైనంత రంధి కొంపలో. తీరు కూర్చొని యీ రాగా లేమిటి భోగా లేమిటి—ఈ అభోజనా లేమిటి నిండుఇల్లో ?

కృష్ణ—(నెమ్మదిగా) అయితే యీ కేకలూ యీ గాపాయింపూ యెందుకూ ? నా కాకలి లేదు. మజ్జిగన్నం తిని లేచి వచ్చాను.

రంగా—అయితే నీకు ఆకలి లేకపోవడాని కేమిటి కారణం ?

కృష్ణ—(రెండో మంచం వాల్చి పైని ప్రక్క సర్దుతూ వుంటుంది)

రంగా—నాకు తెలుసును. అంతా నాకు తెలుసును. చేసే వన్నీ తెలివితక్కువ పనులు అదేమంటే ఆ రోజంతా మాటాడకపోవడం. పిలిస్తే పలకకపోవడం. లోకాన్ని వుద్ధరించినట్టు ముగ మట్టే పెట్టుకోవడమున్నూ.

కృష్ణ—అలా గైపోతున్నా రెందుకూ ? నేనేం చేసినాననీ ?

రంగా—ఇంకేం చెయ్యావలె, ౧౨ రోజులక్రిందట క్యాంపుపోయినాను పారివృష్టం లాగు దినం విడిచి దినం నాటకాలు. ఉన్నచోట వుండలేదు తిన్నచోట తినలేదు. నిద్ర మొదలే లేదు.

కృష్ణ—అయితే అదుగో ప్రక్కవేసే వుంది. హాయిగా పండుకోండి. ఎవరువద్దన్నారు?

రంగా—కాదు. నే నేడిచేది—ఏదో సాయంకాలం కొంపకి చేరుకున్నానా? వచ్చిన తర్వాత ఒక మంచిలేదు చెడ్డలేదు ఒక కష్టంలేదు సుఖంలేదు—విసవిసలూ—రొస రొసలూ చీదరింపులూ చిలిపినేస్తాలున్నూ. ప్రాణానికేమిశాంతి వుంటుంది? ఏమి సంతోషముం టుంది?

కృష్ణ—అయితే యీచిరాకు కంతా కారణం నే నేనా?

రంగా—నువ్వని యేలాగనగలను? నా ప్రాలబ్ధమిది; నేనే కారణం. కర్మంచాలక గడ్డితిని అడిగాను—ఆపాతిక రూపాయిలూ జాగ్రతగా వున్నాయా అని. ఆ మాట రాజద్రోహమయి పోయింది; కాలకూటం లాగ కంఠం పట్టుకొంది.

కృష్ణ—ఆమాట రాజద్రోహం కాలేదు. నేనో చీర గుడ్డ కొనుక్కున్నాని చెప్పడం రాజద్రోహమైంది. దానికి మావాళ్ల వంశం ఇచేడు తరాలూ అచేడు తరాలూ ఎత్తిపెట్టడం, మా అన్న తోట అమ్మివేయడం, మాతమ్ముడు బొంబాయి పారిపోవడం ఇన్నిరావలెనా? మా అన్న చెల్లెలు పెండ్లికి తోట అమ్మివేసేడుగాని అక్రూరుడు వేషానికి ముఖమల్ డ్రెస్సు కుట్టించుకోసి—కృష్ణుడు వేషం కోసం లంచాలిచ్చి భూములమ్ముకో లేదు.

రంగా—నే నమ్ముకొన్నాను సరా! నే నెందుకూ చేతకానివాణ్ని. అయితే యిప్పుడేం చెయ్యడం? మాట వచ్చినప్పుడు బంధువులు నలుగురు సంగతీవస్తుంది. బొంబాయి వెళ్ళడం సానింటికి వెళ్ళడం కాదు. అన్నాను మీ తమ్ముడు బొంబాయి వెళ్ళేడని, అదీ తప్పే? ఇంట్లోసొమ్ము పట్టుక పోకూడదన్నాను. ఎవరుమాత్రం ఇంట్లోసొమ్ము పట్టుక వెళ్ళకపోతే పైసొమ్ము పట్టుక వెళ్తారా యేమిటి? ముందు ఆలోచనలేకుండా సొమ్ము ఖర్చుపెట్టకూడదూ అన్నాను. ఇది బుద్ధిమంతులందరూ చెప్పేమాటే—నా నోటివెంబడి వచ్చింది గనుక పుచ్చిపోయిందికాని. నువ్వుమాత్రం నాముద్దేమి ముక్కలుచేశావు—నా పూర్వచరిత్ర అంతా యెత్తిపెట్టేవు—పదుస్తూనే మాటకు పదిమాట లప్పచెప్పి వేశావు.

కృష్ణ—పోనీండి. తప్పునాదే. క్షమించండి. పండుకొండి.

(తాను సిండా కప్పుకొని రెండవమంచంమీద పండుకొంటుంది.)

రంగా—మనిషై పుట్టినతర్వాత బుద్ధీ జ్ఞానమూ వుండవలె. అదిలేకుంటే మనిషికీ పశువుకీ భేదమేమిటి? ఎదుటివాళ్ళహృదయం తెలియకపోయిన తర్వాత మనిషి పశువుకంటే అర్ధాన్నం. ఒకర్ని అని లాభమేమిటి? అది ఇవతలవాళ్ళ కర్మఫలం, అవతలవాళ్ల జాతకఫలమున్నూ. ఎంతపుణ్యం చేసుకుంటేగాని తగిన దాంపత్యం కుదురుతుంది? తుమ్మితే ఊడిపోతే సే మనిషితో యెన్నాళ్లు కాలక్షేపం చెయ్యగలం? నచ్చిసచ్చి వొచ్చాను— కొండో గోపురమో— ఇక్కడనేమో బొవుకుందామని—ఇక్కడబోజు ఈలాగు బొగ్గులవుతున్నాది. ఇంటికంటె గుడి పదిలమని యేముంది మళ్లీ రేపు సాయంకాలం ప్యాసంజరులో బెజవాడ పోతాను. అదృష్ట మన్నప్పుడు ఆడిక్షీతులది అదృష్టం. అతడు గడపదాటిన దగ్గరనుంచీ ఆమహాయిల్లాలు కళ్లు కిటికీలోనే పెట్టుకొని చూస్తూవుంటుంది—భర్తమళ్లీ యెప్పుడువస్తాడో అని, పోనీ ఆలాగని వా డావిడముద్దేమైనా ముక్కలు చేస్తున్నాడా?......ఏమిటి? అప్పుడే నిద్ర పట్టిందా యేమిటి?...... రోజుకు వంద మాట్లో తీ చేస్తూవుంటాడు. ఆవిడ అలాగే కాలక్షేపం చేసుకొని వస్తూంది. మాటవరసకి చెప్పేను. ఇప్పుడు నువ్వేమిటో మహాతప్పులు చేసేస్తున్నావనికాదు. అసలు మాన్నే హితులందరూ నువ్వు మహాపుత్తమురాలివి—నువ్వుండబట్టి భూమిమీద చినుకు పడుతున్నాది, నాకన్నం దొరుకుతున్నాదంటారు. వచ్చిన పేరు నిలబెట్టుకోవలె...... వింటున్నావా? క్రిష్ణా! క్రిష్ణా!......ఈ మొంకితనమే నీలోవున్నది......అదేనాకు కిట్టదు. ఇప్పుడు నిన్నేమి మహామాటలనేశానని నీకీ అలక? ఇంటోవున్న తర్వాత మాటకుమాట అనుకోం? అంతటితోనరా? అంతే? నీకు ఇప్పుడోమాట చెప్తున్నాను—ప్రేమవున్న దేలది...

వింటున్నావా...ప్రేమఅనేది మనుష్యులలో ఎలాగు వుంటుందో తెలుసునా...మల్లెపువ్వు...మల్లెపువ్వు... ఏం...(రెండుమూడుసార్లు ఇట్టటు వూపి కోపంతో) ఛా! ఏంమనిషివి పోనిస్తూ. నువ్వు సుఖపడలేవు; ఒకరిని సుఖ పెట్టలేవు. నీబ్రదుకీలాగు వెళ్లవలసిందే— పారేపల్లి సుబ్బారావులాగ నువ్వేమో బింకంపడితే అద్దంకి శ్రీరామ్మూర్తిలాగు నేను కాళ్లావేళ్లా పడతాననుకోకు. క్రిష్ణా! చెప్తున్నాను, తర్వాత విచారిస్తావుసుమా......సరే— కానీ—

(తానూ వేరుగా ఇంకో మంచంమీద పండుకొంటాడు)

(క్షణం నిశ్శబ్దం)

రంగా—వాకటి తలుపు గడియ గట్టిగా వేశావా?

కృష్ణ—ఊఁ.........

రంగా—క్రిష్ణా!......అన్నట్టు మొన్న కాకినాడలో మీ అన్నయ్య కనబడ్డాడు......మంచినీళ్లు పెట్టేవా?

కృష్ణ—మంచంకిందనే వున్నాయి.

రంగా—(ఒరిగి నీటిచెంబు తడవి కొంచెము పైకెత్తి తాగకుండనే మళ్లా చప్పుడుచేస్తూ క్రిందనుంచివేస్తాడు) అమ్మా...అమ్మా...శ్రీరామచంద్రా...ఉస్సు క్రిష్ణా! కొంచెం శొంఠిగంధము తీస్తావా?

కృష్ణ—శొంఠిలేదింట్లో.

రంగా—యూక్లిప్టస్‌ఆయిల్ కూడా లేదేమో...తల బ్రద్దలైపోతున్నది...మీ అన్నయ్య కాకినాడలో కనబడీ......ఏదీ శాలువ?

కృష్ణ—కాళ్లకడ దిక్కునవుంది.

రంగా—రామరామ—మొన్న హీజ్ మాస్టరు వాయిస్‌వాళ్ల ఏజంటు కనబడి నన్ను ౧౦ రికార్డ్లకి బుక్కుచేస్తానన్నాడు...అతినికిటీ యిప్పించేను.జూలైలో మనం బెంగుళూరు వెళ్లాలి. వస్తావా? అబ్బాబ్బా! క్రిష్ణా! నీకు చలిగావుందా? ఉహుహూ

కృష్ణ— చలినాకూలేదు— మీకూలేదు. పండుకోండి—సర్దుకొంటుంది.

రంగా—జ్వరం వచ్చినట్టుంటే నాకు చలిలేదూ? చూడునావొళ్లు...రాయి—రాపాషాణం,...పాపాత్ము రాలు—

(మొగం కప్పుకొని ౫ నిముషాలుండి)

అన్నట్లు పాలలో తోడువేశావా? ఏం మాటాడవేం? (లేచి) లేకపోతే ఆపాలు పులిసిపోయి ధ్వంసమవుతాయి...బాగుంది...నీకేం పోయింది? డబ్బుపెట్టేవాణ్ని నేను—కష్టపడేవాణ్ని నేను—చేసుకొన్న బ్రాహ్మడా అనుభవించు అని నాకేలాగు తప్పుతుంది? నేనైనా తోడువేస్తా.

(దిగివచ్చి మజ్జిగగిన్నతీసి ఆమెకుచూపి)

ఇదంతా వేసివేయనా? కొంచెం వేయవచ్చునా? ఏం, నాకేం—అంతా వేసివేస్తా—పులిసిపోతుంది—పోసి.

(వేసివచ్చి తనమంచం మీద మఠం వేసికొని కూర్చుండి.)

ఆఖరికి మాయింటి వ్యవహారమింతకు వచ్చింది. మొగుడంటే రుక్మిణిలాగ భక్తిలేక అధమం సత్యభామలాగ ప్రేమఅయినా లేక కేవలం కనికిష్టంగా జాంబవతుల్లాగ తేలితే ఇంక మూగతేమిటి? ఈవాళ నేను పాలు తోడుపెట్టవలసివచ్చింది; రేపు వండవలసివస్తుంది; ఎల్లుండి అంట్లుతోమవలసి వస్తుంది. ఇంక నేనే పెండ్లాం అదే మొగుడూ అన్నమాట—నేనుకూడా దశరధుడూ రాజనరేంద్రుడూ వీళ్ళమచ్చు వెర్రి వెంగళప్ప నయిపోయినాను.

కృష్ణ—(లేచి తనమంచముపై అతని కెదురుగా కూర్చొని) మరెవర్నీ నిద్రపోనివ్వరా యేమిటి? చాలా బాగుంది ఈ వేలంబం.

రంగా—నువ్వు నన్ను నిద్రపోనివ్వలేదు. హాయిగా పండుకొన్నవాణ్ని లేవగొట్టి నాచేత పాలల్లో తోడు వేయించేవు—నాకతురాభ్యాసం చేశావు...

కృష్ణ—ఏమిటీ కవిత్వం? మిమ్మల్ని ఎవరు వెయ్యమన్నారు?

రంగా—మరి నువ్వు వెయ్యకపోతే నేనేం చెయ్యడం?

కృష్ణ—నేను వెయ్యలేదని మీకేం తెలుసును?

రంగా—మరి అడిగితే యెందు కూరుకున్నావు?

కృష్ణ—నే నింతకుముందు వేశినాను గనుక. మరిచి పోయివుంటే జ్ఞాపకంవచ్చి వెంటనే వెయ్యనూ? రోజూ మీరే వేస్తున్నారా? ఎప్పుడేనా వేశారా లేక.

రంగా—మరి పెదవి కదుపుతే తరిగిపోతావా? అంటే కోపంగాని ఆమాత్రం మాట అప్పుడు చెప్పకూడదూ?

కృష్ణ—ఎన్ని ప్రశ్నలకని చెప్పేది జవాబు? ఒకకొత్త వాగ్ధోరణి బయల్దేరింది. ఏమిటీ ప్రేమంటే అని యేమో చెప్పబోతున్నారు. ప్రేమంటే బ్రాహ్మణులలో మల్లెపువ్వా? (నవ్వుతుంది)

రంగా—(నెమ్మది నవ్వుతూ) బ్రాహ్మణుల్లో అని యెవన్నాను? మనష్యుల్లో అన్నాను నేను. నవ్వు కేంగాని నువ్వు చేసి మళ్లీ నాచేతకూడా యెందుకు వేయించినావు?

కృష్ణ—మళ్లీ అదేపాట పాడతారు—నేను వేయించలేదు. నేను పాలలో తోడువేశాను, మీరు నేతిలో తోడువేశారు.

రంగా—ఆఁ ఆఁ—

కృష్ణ—అవును పెన్నెడు మజ్జిగా తీసికెళ్లి తేరున్నర నేతిలోను పోసివచ్చేరు.

రంగా—ఆ అంటే నీకు కో—కో—కోపంగాని గుగు—గుమ్మడికాయల్లాగ కళ్లు—కళ్లుపెట్టుకొని చూస్తూ వూరుకొన్నావు. న్యాయమే? బాగుందీ?

కృష్ణ—మహాబాగుంది. మావనల్లోకి మీరెప్పుడు వచ్చినా ఈలాగే అవుతుందను కోండి—తెలిసిందా? నే నెప్పుడైనా మీ భీమరాజు వేషానికి కుదురుకొన్నానూ?

రంగా—వేమంమాట దేముడెరుగును—ఆనెయ్యి తేమజ్జిగ ఓడ్చేదాము.

కృష—లాభంలేదు. నెయ్యి సాయంకాలమే పోయించుకొన్నాను. ఇంకా పేరకోదు, రేపేదో కాచిపుపిండి వంట చేసేదాము. ఇది జరిమానా అనుకోండి.

రంగా—అనుకోక యేంచేస్తాను. ఆపాతికాజరిమానా అనుకొన్నానా! ఈమూడూ జరిమానా. నాబ్రదుకే ఒక జరిమానాలాగుంది. ఈ జరిమానాకి మరోజరిమానా కలుపుదునా?

కృష్ణ—అదేమిటది?

రంగా—తెలివితక్కువ దానివి. ఆగ్రహించి రెండు మెతుకులైనా నోట్లో వేసుకోకుండా లేచి పోయినావు. చప్పున దేవీకొట్టుమీదకు వెల్లి ఒక్క అర్ధశేరు మిరాయి తీసుకొస్తాను

కృష్ణ—ఇంకా వుంటుందా కొట్టు?

రంగా—ఇప్పుడు ౧౧–౨౦ గం॥ గా అయింది?

కృష్ణ—పాపం! జ్వరం—తలనొప్పి—దుర్దాహం—ఏలాగు వెళ్లారు?

రంగా—ఈపెంకెమాటలు బాగావచ్చునే–౫ నిముషాల్లో వస్తాను (లేస్తాడు)

[తెరదించి ౧౫ నిముషాలు సూచించడానికి 3 నిముషాలుంచి తెర యెత్తవలె. రెండవమంచ మెత్తిపెట్టి వుంటుంది. కృష్ణవేణి మంచి చీర కట్టుకొని—వాలుజడ వేసికొని మొగానికి పౌడ రద్దుకొంటూ అద్దం యెదుట నిలబడుతుంది. రెండుమూడు పొట్లాలు తువాలులో కట్టి చిన్నపాప నెత్తికొన్నట్లు చంకను పెట్టుకొని వచ్చి ముసి ముసి నవ్వులు నవ్వుకొంటూ రంగారావు వెనుక నిలబడతాడు. కృష్ణవేణి ముందున్న జడతో అత్తర్ని విసరి కొడుతుంది.]

రంగా—అబ్బా! అదేమిటది ఆమోటు సరసం!

కృష్ణ—లేకుంటే పొంచివుండి ఆదొంగచూపులు చూడడ మేమిటి?

రంగా—ఒకకవి చెప్పాడు—ఈపద్య మెంతబాగుందో చూశావు?

> అద్దమున చూచుకొనుము నీ ముద్దుమొగము
> నీకె నోరూరజేయు నీ నిండుసొగసు.
> ముద్దు గొనలేవుగద నీదుమొగము నీవె
> ఆవనికి నన్నియోగింపు మంబుజాక్షి.

కృష్ణ—బాగుంది కాని ఇది భర్త భార్యనడిగిన మాట కాదు. మీరు నాకొక్క మాట యిస్తారా?

రంగా—ఏమిటిగదా ?

కృష్ణ—మరి పద్యాలు చదవనని—మాటాడుకుం దుకు మనకు మాటలు లేవూ ? వీళ్ళ మాటలూ వాళ్ల మాటలూ యెరువు తెచ్చుకోవాలా ?

రంగా—నిజమే. ౧౮ రోజుల ముచ్చటలు నేను నీకు చెప్పాలి—నువ్వు నాకు చెప్పాలి.

కృష్ణ—సరిగా చెప్తే ౩౮ రోజులు పడుతుంది. ముందర ఆ భారం దింపండి. ఇదేమి టది ? కొట్టుమీద మిగిలిన సరుకంతా గుత్తజట్టీమీద తెచ్చారా యేమిటి ?

రంగా—లేదు లేదు. పకోడీ—రసగొల్లా—అంతే పొట్లాం డాబుగా కడతారు.

కృష్ణ—ఇప్పు డొద్దు. ఉండనివ్వండి.

(తా నొక కిల్లీ వేసుకొని అతని కొకటి యిచ్చి) మీరు చాలా శ్రమపడుతున్నారు గనుక నేను మీ కొక ప్రెజంటు యిస్తాను. మీరు నా కివ్వకపోతే నేనైనా మీ కివ్వవద్దా ? ఇందండి. (అతని కి పాయిల నోట్లు ఇస్తుంది)

రంగా—ఇదేమి టిది ? ఎక్కడివీ ఇవి ?

కృష్ణ—మీ రిచ్చినవే. నేను చీర కొనలేదు. రావడమే అదే ప్రధానంగా వున్నట్లు మాటా మంతీ యేమీ చెప్పకుండా రూపాయిల వూ సెత్తితే నాకు అరుచి అనిపించి ఆలాగు చెప్పినాను.

రంగా—బాగుంది. చీర కొనకుండా వుంటే ఈ పాతిక మీదా మరో పాతిక వేసి మంచి బనారస్‌చీర కొందా మని నే నడిగినాను. ఈ ప్రయాణంలో ౫౦ మిగిలింది. ఇంద నీవి పాతిక—నావి పాతికా.

కృష్ణ—నీవి పాతికా ? ఇంతే? వీటికోసం మళ్లీతగాదాపెట్టరు గద !

రంగా—సొమ్ము నీదగ్గర వుంటేనేం నాదగ్గర వుంటేనేమిగాని ఆ నెయ్యి చెడిపోయింది—మనస్సు కించగానే వుంది సుమా ?

కృష్ణ—కించ పడడానికి వేళా పాళా మీకు తెలీదు సుమండి. చెప్పకేం గాని మీరు నేతిలో మజ్జిగ వెయ్య లేదు. మజ్జిగలోనే మజ్జిగ వేశారు. అంచేత ప్రమాదం లేదు.

రంగా—అయితే నేతిలో వేశా నన్నావేం ?

కృష్ణ—అది నెయ్యయినా అమృతమైనా మీరు చల్ల చుక్క వెయ్యవలసినవారే కదా ?

రంగా—నీతో శాంతిక్షేపం చెయ్యడం కష్టమే.

కృష్ణ—పోనీ మురొవరినేనా తెచ్చుకోండి.

రంగా—డైమన్ రాణీలా గున్నావు—మళ్ళీ ఈలాంటి వ్యక్తి నాకెక్కడ దొరుకుతుంది ?

కృష్ణ—మీకు లేరూ కళావరు రాజులాగా ?

(లోపల, తలుపు తట్టిన ధ్వని)

బావా !

రంగా—వీ డెవడీ ఇనస్పెక్టు జాకీ !

(లోపల)

అక్కయ్యా !

కృష్ణ—ప్రసాదం !

రంగా—ప్రసాదం కాదు—విషాదం. (ముసుగు తన్ని వండుకొన్నాడు !

ప్రసాదం—౧౮ సం॥ పిల్లకాయ—ఏవరి—లేలిపైన ముఖం. చేతులో సూటుకేసుతో హాజర్

---

# శబ్‌నవీస్

భావరాజు వేంకటకృష్ణారావుగారు బి. ఏ. బి. ఎల్

౧

పెద్దిభట్టు త్రివేది మాధవపజ్ఝలుకు మూడవ కుమారుడు. అతని అన్నగార లిరువురును మహాపండితులై, వివాహితులై, సంతానవంతులు గాక పూర్వము శాపగ్రస్తులైనట్లు, ఒకరి తరువాత నొకరు అకస్మికముగ మరణించిరి. అంతట మాధవపజ్ఝలు దుఃఖభరముచేత భగ్నహృదయు డయ్యెను. స్వగ్రామ మగు నీలపాడుపై రోసెను. అచ్చట నొక క్షణమైన నుండ నొల్లక, రెండు నెలలవానిని, కందువును, పెద్దిభట్టును దీసికొని, కృష్ణదాటి, మచిలీ బందరు పరగణాలోనికి వలస బోయెను. అక్కడ సామగ్రి చెంత నున్న పుట్టగుంట అగ్రహారమున, మేనమామల ప్రాపున, స్థిరనివాస మేర్పఱచుకొనెను.

మాధవపజ్ఝల పూర్వులు గణితశాస్త్రోపాధ్యాయులని ప్రఖ్యాతి గడించిరి. అతని వంశకర్తలలో నొకడు నృసింహసోమయాజి. అతడు నాలుగు క్రతువులు జేసెను. మహావిద్వాంసుడని, త్రివేదియని, మహాతార్కికుడని, గణితశాస్త్రజ్ఞుడని, కాకతిరుద్రాంబిక చెలియలు మహామండలేశ్వర కోటగణపమదేవులు, మన్నించి, అగ్రహారమిచ్చి, "పరవాదికుంజరఘటాసింహ"మని బిరుదిచ్చెను. అతని వంశజులలో నొకడు పెద్దిసోమయాజి. అతడు "దైవజ్ఞచూడామణి" యని ప్రఖ్యాతి గాంచెను. అతని పాండిత్యమునకు అచ్చెరువంది అనవేమారెడ్డియంగారు, తాండిమఱ్ఱు గ్రామము నగ్రహారముగా కొసగి బహూకరించెను. పెద్దియజ్వ సంపాదించిన యగ్రహారము మాధవపజ్ఝుల తండ్రి కాలమున, ఒడ్డిరాజుల దౌష్ట్యమువల్లను, తురకప్రభువుల నిరాదరణమువల్లను పరాధీనమైపోయెను. ఆ కథ నింకొకమారు సావకాశముగ దెలుపుదుము. పితృపితామహమైన అగ్రహారములు, కొణాచియు బోయిన తరువాత మాధవశర్మ తండ్రి నిలువ నీడ లేక అలసాడునకు కాపురము వచ్చెను.

పెద్దిభట్టున కీ కథ నాటికి యెబదియేండ్లు వయసుండెను. ఆ గర్భదారిద్ర్యమును, ఆ బాల్యార్జితమైన అభిమానవిద్యలును తప్ప పెద్దిభట్టునకు విత్తముగాని, మాన్యక్షేత్రములుగాని, యేవియు లేవు. అతడు కుచేలసదృశుడు. కాని కుచేలుని కున్న బహుళసంతానభాగ్యము కూడ పెద్దిభట్టునకు లేదు. అతనికి చిరకాలమునుండి తన పేరింటి పూర్వునివలె వేదోక్తక్రతువుల నాచరించి, సోమయాజియై గణుతి కెక్కవలయునన్న యభిలాష గాఢముగ నాటుకొని యుండెను. ఆ పెద్దియజ్వవలె, తానును విద్వాంసుడు గావున 'దైవజ్ఞచూడామణి' యన్న బిరుదమును గడించి, యొక అగ్రహారమును సంపాదింపవలయునని యాశ పెట్టుకొనెను. కాని యేదినము కాదినము జీవయాత్రయే సాగుటకు కడు దుర్భరముగా నుండిన యా పెద్దిభట్టునకు ఆ పెద్ద కోరికలు మనసును మరింత నానాటికి క్రుంగజేయుచుండెను.

ఆదినములలో, క్రోధిసంవత్సర మాదిగ నాలుగేండ్లు వెనుకొటకము ప్రబలి ప్రజలను పీడించివైచెను. కాటకము వచ్చినవెనుక మారి జాడ్యములు వరుసగా వచ్చెను. ప్రజలు భీతిల్లిపోయిరి. అంతట ప్లవంగ సంవత్సరము వచ్చెను. కటికిలేమికి అగలేక, పెద్దిభట్టుగారి భార్య యొకనాడు భర్తచెంతకు జని, "బిడ్డలు, పాపలు లేకున్న మానెను; కూడుకుడు గుడ్డకునుగూడ దూరమై యిల్లు జీవితాంతముగ అగచాట్లు పడుచుండవలయునా" అని కడుపులోని ప్రేవులు కదిలి బయిటబడునట్లు పలుకుచు నేడ్చెను. "ఎపుడో అఖిలైశ్వర్యములు కలుగునని, జీవితములో ముప్పాతికవంతునకు పైగా గడచిన మీకు గల విచిత్రపుటాశకు, ధైర్యమునకు నేనాశ్చర్యపడుదును. మన తిరిపెము నేనుపుట్టినది మొదలు నొక్కరీతిగా నున్నది. దినములు గడిచినను దిరిపము గడచిపోలేదు—మొదటినుండియు మన బ్రతుకు నీయూరిలో నొక్కరీతిగా నున్నది. పూట పూటకు ఎచ్చటనుండియో స్వయం పాకములు తెచ్చుకొని జీవితము గడపుటతో సరిపోవుచున్నది. ఈ యూరు మనకేమి భాగ్యమబ్బ జేసినది ? ఏదైన పట్నము జేరి యచ్చట ముష్టియెత్తుకొని యైన సుఖముగా జీవింతము. పదండు—మంచిముహూర్తము చూచి పయనము గట్టుదము. గోల్కొండ జేరినవారికి భాగ్యమునకు కొదువలేదట—అక్కడకైనను దారిబత్తెములు వేడి తెచ్చుకొని పోవుదము లెండు అని పెక్కువిధముల హెచ్చరించెను.

ఆరోజులలో సుబాలు ఏలుచుండిన నవాబులు సుబేదారులు నెంతటి బలవంతులో, చిన్న పరగణాలలోను, పట్టణములలోను, ఖిల్లాలలోను, ఉండి దేశమును పరిపాలించెడి, కొత్వాల్లు, ఫౌజుదారులు, ఖిల్లేదారులు, సిరస్తాదారులు, జమీందారులును అంత క్రూరులయి ప్రవర్తించుచుండిరి. కావున కాటకముతోపాటు క్రూర పరిపాలనము దేశమందలి ప్రజలను పీడించి, శల్యగత ప్రాణులను జేయుచుండెను.

దూరమున నుండిన గోల్కొండ కుతుబుశాహీ సుల్తానువారి దర్శనభాగ్యమైనను లభించునుగాని, చెంతనున్న ఖిల్లేదారుని దర్శనము లభించదు. ఒకవేళ కలిగినను, అమహనీయుడు, అర్తుడైన వాని మొఱవిని న్యాయము చేయజాలడు. అధికారి కలిగించిన భాగ్యమును న్యాయమును ఆయనకు తెలియకుండ తాబేదారు జేదో వంకబెట్టి మాయముజేసి అపహరించి—మొదలంట నపకారము జేయును. ప్రభువుకడ మొఱపెట్టుకొని కష్టములు తొలగించుకొన్న భాగ్యశాలి, సుల్తాను అబ్దుల్లాగారి పరిపాలనమునందు, కంచుకాగడాబెట్టి వెదకినను గానరాడు. పాపము, ఆ ప్రభువేమి చేయగలడు? అతని పరిపాలనా విధాన మారీతిగా పరిణమించెను. తీయని ఫలము లొసగు చెట్లచుట్టును ప్రబలిన ముండ్లపొదలవలె, దయామయులయిన ఆకాలపు ప్రధానరాజపురుషుల చుట్టును సిరస్తాదారులు, మజుందారులు, తహశ్శీల్దారులు, తాలూక్దారులు దేశ

పాండ్యాలు, దేశముఖులు, మున్నగువార లెందరో ప్రబలియుండి ప్రజలకు న్యాయపరిపాలన భాగ్యమును లేకుండజేయుచుండిరి.

ఆదినములలో ప్రయాణసౌకర్యములు లేవు. పెద్దిభట్టును ఆతని గృహిణి అన్నమ్మగారును, అరోజునకు గావలసినదానిని మూటగట్టుకొని యొక శుభదినమునందు కాలిబాటను బయలుదేరి, ముస్తాఫానగరమునకు ప్రయాణమయిరి. కొండపల్లికి ముస్తాఫానగరమని ఆదినములలో వ్యవహారనామము. ఆమహానగరమా కాలమున ప్రసిద్ధిలోనుండెను. మనదంపతులకాపట్టణమును జేరునప్పటికి నాలుగు దినములు పట్టెను. ఇల్లు కదిలి ఒక మైలుదూరమయినను నడచి యెరుగని అన్నమ్మగారికి కలిగిన ప్రయాణపుబడలిక, ఇంతింత నివర్ణింపతరముగాదు. వండుకొనిన యూరిలో పండుకొనుట లేకుండ, యెట్లో అష్టకష్టముల ననుభవించి పెద్దిభట్టు కొండపల్లి జేరుకొనెను.

ఆ బ్రాహ్మణ దంపతులు వంటచేసుకొని భుజించుటకు పరికరములును సంబారములును నిలువనీడయుగూడ నా మహానగరమున మృగ్యమయ్యెను. రాత్రి గడచివచ్చుటవలన, నాదంపతులు మెల్లగా కాళ్లీడ్చుకొనుచు పుణ్యాత్ముడయిన ఒక మహమ్మదీయుని సహాయమున, వాపవినాశదేవర నగరులోనికి జని యందా రాత్రి విశ్రమించిరి. అభ్యాగతులయిన ఆ బ్రాహ్మణ దంపతులను పార్వతీ పరమేశ్వరులని భావించుకొనుచు, నత్యాదరముతో స్థానాపతి వంటచేసుకొని భుజించుటకు సదుపాయములు గల్పించెను. భోజనాదికములు ముగియునప్పటికి వెన్నెల యుదయించెను. ఆ వెన్నెలలో స్థానాపతి, తన దేవసదనమునకు అభ్యాగతులయివచ్చిన పుణ్యదంపతులను కుశలప్రశ్నాదికములు చేసి పుట్టుపూర్వోత్తరముల నెఱుగగోరి సమీపించెను. పెద్దిభట్టుగారి గోడంతయు సాదరముగా నాకర్ణించి, పాపమా స్థానాపతి గద్గదికతో, "అయ్యా! పెద్దిభట్టుగారూ! తమరు దైవజ్ఞులని, కార్తాంతికులని, సిద్ధాంతులని సెలవిచ్చినారే! తమ జాతకమును తామెక్కడా పరిశీలించుకొని భవిష్యత్తును తెలుసుకొనలేక పోవుచున్నారేల! నాకిది చాలా ఆశ్చర్యకరముగా నున్నది" అని ప్రశ్నించెను.

"కేశవయ్యగారూ, తమరు సర్వం తెలిసినవారు. గ్రహచారం ఎంతకాలము అనుభవించవలెనో అంతకాలము ఎంత ప్రయత్నించేసినా నిష్ఫలమే నండీ! విచారించిన ప్రయోజనము లేదండీ!" అని పెద్దిభట్టు నిట్టూర్పొకటి విడిచెను.

"చిత్తం! చిత్తం! అలాగేనండీ!...............తమరు దైవజ్ఞులని సెలవిచ్చినారు. నాదొక విన్నపము, అనుజ్ఞ అయితే మనవి చేసుకుంటాను" అని కేశవపండితుడు వినయముతో, సందేహించుచున్నట్లు అడిగెను.

"కేశవయ్యగారు! తమరడుగబోయేటటువంటి ప్రశ్న నాకు తెలిసినదండి! నేనే మనవిచేయబోవుచుంటే, తామే ప్రశ్నించినారు. * * * తమ కిపుడు ఏడ్గురుసంతానము; అంతా స్త్రీలే మొదటపురుష సంతానము కలిగి నష్టమయినట్లున్నది. నిజమే కదండి. కానియ్యండి. ఈకార్తీక బహుళ సప్తమి మొదలు, పదునాలుమాసములలోగా తమకు పుత్రసంతానము కలుగనున్నది. అవును. ఆ పుత్రుడు దేశముఖ్యుడు కానున్నాడు. తమకు మహాభాగ్యవంతుడు పుట్టనున్నాడు" అనుచు పెద్దిభట్టు తడుముకొనకుండ జోస్యము చెప్పెను.

స్థానాపతి కేశవయ్యగారికి ఆమాటలు చెవిని సోకినంతనే మేనులు ఝల్లుమనియెను. అంతవఱకు కూర్చుండి మాటలాడుచున్నవాడు తటాలున లేచి, పైనున్న యుత్తరీయమును నడుమునకు జుట్టుకొని భక్తి, వినయసంభ్రమములతో, సాష్టాంగముగ ప్రణమిల్లి "తాము నిశ్చయముగా మహాత్ములు, తమ ప్రభావమును ఎఱుగక నేను తమ యెడల నేమయిన అపచారము చేసితినేమో! మన్నింపవేడెదను. తామిపుడు వచించినదానిలో గతము నిజము, భవిష్యత్తేల యథార్థము కాగూడదు" అనుచు వచించెను.

స్థానాపతి కేశవయ్య జేసిన మహాసత్కారము వల్లనేమి, సహాయమువల్లనేమి, కలిగించిన ప్రోత్సాహమువల్లనేమి ముస్తాఫానగరమునుండి మంచిరోజు చూచుకొని కచ్చడముకెక్కి అదృష్టమును వెదకుకొంటూ పెద్దిభట్టు భార్యాసమేతుడయి మెల్లగా గోల్కొండకు ప్రయాణమయ్యెను. మార్గశీర్ష మాసాదిలో బయలుదేరిన పెద్దిభట్టు ఫాల్గుణమాసాంతము గడచునాటికి గోల్కొండ జేరగలిగెను.

ఆమహారాజధానిలో పెద్దిభట్టునకు చుట్టాలు, పక్కాలు లేరు సరిగదా; ఎరిగిన వారొకరు గూడ కనబడలేదు. ఆమహాపట్టణములో నెటుచూచినను భీభత్సమయిన విపరీత కోలాహలము మాత్రమడుగడుగునకు అతని హృదయమునందు భీతికలిగించెను. విద్వాంసుడగుటచే పెద్దిభట్టు గోల్కొండపట్టణము జేరిన మరునాడు బ్రాహ్మణవాడ వెదకికొనుచుబోయి, అచ్చట నొక విప్రవితంతువుయొక్క అనుగ్రహమువలన నామెయింటిలో నొక భాగమునందు బసయేర్పాటు చేసుకొనెను. ఆ బ్రాహ్మణికి కూడ దగ్గరచుట్టములు ఎవ్వరును లేనికతన, అన్నమ్మను కుమార్తెవలెను, పెద్దిభట్టును అల్లునివలె ఆదరించెను. నివాసము కుదిరినపిమ్మట నాతడు తన పాండిత్యప్రకర్షవల్ల నామహానగరములో జీవనము సాగింపనారంభించెను.

ముస్తాఫానగరమునందువలె గోల్కొండయందు గూడ పెద్దిభట్టునకు ఒక వింత పరిచయము కలిగెను. తెల్లవారినది మొదలు శ్రీమంతులని తోచినవారిదగ్గరకుజని, కనబడినవారికి అయాచితముగా జోస్యము చెప్పుచు, వారొసగు విత్తమెంత స్వల్పమయినను, మహాప్రసాదమని స్వీకరించుచు, వాశీర్వదించుచు, పెద్దిభట్టు దారిద్ర్యబాధ ఎఱుగకుండ సుఖముగా కాలము గడుపసాగెను. అట్లుకొన్ని దినములు, వారములుకూడ గడచిపోయెను. ఆబ్రాహ్మణుడు కాపురమున్నవాడలో సమీపమున, నొక యుద్యోగికూడ కాపురముండెను. అతడు అందరికంటె నించుక పెద్దయుద్యోగి యగుటవలన గాబోలు, నావీధి వారందరు, ఆయనగూర్చి ప్రశంసచేయువలని వచ్చి

వపుడు, ఆయనను ,అయ్యాగార' నియు, ,పంతులుగార' నియు వ్యవహరించుచుండిరి. ,అయ్యాగారి' అసలుపేరును అందరు, నన్ని విధములుగా నుచ్చరించుచుండిరి. ఇంటిపేరు ఎవ్వరికినిగూడ తెలియదు. ఆంధ్రులాయనను మారయపంతు లనుచుండిరి. కర్ణాటులు గూడ నట్లే బిలుచుచుండిరి. కాని మహారాష్ట్రులు, పారశీకులు, తురకలు మొదలగు రాజపురుషులు మాత్ర మాయనగారిని ,మోరోపంతుల'ని వ్యవహరించుచుండిరి. ఆంధ్రులు మారయపంతులును ఆంధ్రుడని విశ్వసించుచుండిరి. కర్ణాటులాయన తమవాడని గర్వపడుచుండిరి. మహారాష్ట్రులాతని చిత్పవనశాఖీయుడయిన కొంకణ బ్రాహ్మణుడని వాదించుచుండిరి. కర్ణాంధ్రమహారాష్ట్ర బ్రాహ్మణులు మువ్వురితోడను ఆతునకు సంబంధ బాంధవ్యములు గలవు. ఆ కారణమున నీ సంశయము కలిగెను కాని నిజమున కాతడు ఆంధ్ర బ్రాహ్మణుడే!

మారయ పంతులుగారి విషయమును కర్ణాకర్ణిగ విన్ననాట నుండియు పెద్దిభట్టునకు నా అయ్యాగారి సందర్శనము చేయవలయు నను అభిలాష నొడమెను. అయ్యాగారు మహావితరణశాలి అన్నకీర్తి గూడ పెద్దిభట్టుగారి చెవిసోకెను. అనుహానుభావుని దర్శనము చేసినచో తన దారిద్ర్యము ఒక్కసారిగా వదలిపోవును అని యాతడు తనలోతాను ఊహించుకొనెను.

తన వాడలో నివాసమున్నవారే గనుక అయ్యావారు ఎప్పుడు కోరిన అప్పుడే దర్శనము కాగలదని, ధైర్యముతో పెద్దిభట్టు, మారయపంతులుగారి లోగిలికిబోయి అయిదారు పర్యాయములు విఫలమనోరథుడై యింటికి మరలివచ్చెను. పెద్దిభట్టు, సూర్యోదయము కాకపూర్వమే యరిగినను, మిట్టమధ్యాహ్నము వేళజనినను, సాయంసమయమందు జూడబోయినను, ఇంటిలోని సేవకులు, "అయ్యాగారు ఇపుడే ఒక అరగడియక్రిందనే, ఒక ముహూర్తము క్రిందనే, ఇంతక్రితమే, దస్తర్ ఖానాకు అరిగినారు." అను ప్రత్యుత్తరము లిచ్చుచుండిరి. మరలతిరిగి యెప్పుడు వత్తురోయని యడిగిన, "మేము తెలుపజాలము; మాకు తెలియదు" అనుచు మారు బల్కుచుండిరి.

ఈ చర్యఅంతయు పెద్దిభట్టునకు మిక్కిలి వింతగాదోచెను. తుద కాయన ప్రాణము విసిగిపోయెను. ఒకనాడు ఎప్పటియట్ల అయ్యాగారింటికిబోయి, విఫలమనోరథుడయి, మొగసాలయందు విచారముతో చదికిలబడియెను. ఆబ్రాహ్మణపుంగవుని దైన్యస్థితిని పరికించుచు నొకడు ఆ తావునకు జనుదెంచెను.

ఆతనిజూచి పెద్దిభట్టు రెండు ముహూర్తములు యోజించి "ఓరీ! నీచెలి విముక్తియగు కాలము సమీపించినది సుమా? నేటినుండి సరిగా నొక నెలనాటికి నీవుకోరిన పడుచు నిన్ను పెండ్లియాడ గలదు! నీవు భాగ్యవంతుడవగుదువు. నీ ప్రయత్నములన్నియు సఫలములగును. నీవూ జమీందారుడవు కాగలవు." అని పల్కరించెను.

వాడంతట సంతోషమును, తమకమును అపుకొనజాలక "స్వామి దండాలు. దండాలు. నాపినతండ్రి నా మాన్యమువంతయు నూడ లాగుకొని నన్ను నిరుపేదను జేసినాడు. నాకీగతి పట్టించినాడు. దేవరా! నాకు నిజముగా, పోయిన భాగ్యము నిజముగా, నిజముగా, మరలవచ్చునా! వచ్చునాస్వామి వచ్చునా?" అనుచు సాష్టాంగముగ నమస్కరించి, రెండుపాదములను గట్టిగాబట్టుకొని విడువడయ్యెను. పెద్దిభట్టు ఆసేవకుని లెమ్మని, విశ్వాసము కలిగించు మాటలను పెక్కింటిని జెప్పి సంతోషస్వాంతుని జేసెను. అంతట వాడు "అట్లయిన, దేవరా! ఆనాడు తమకు వేయినూటపదార్లు వరహాలు కానుక ఇత్తును; దేవరా!" అనుచు ఆనంద బాష్పలోచనుడై వాగ్దాన మిచ్చెను. అపుడు పెద్దిభట్టు ఇంచుక మందహాసము జేసి "ఓరీ! నాకు మారయపంతులుగారి దర్శనభాగ్యము కలుగు నుపాయము చెప్పవలెనురా! అదియే నేను నీవలన కోరు పారితోషికము" అని అనియెను.

"చిత్తం, చిత్తము దేవరా! దేవరవారికి అంతా యీపాటికే విశదమయి యుండాలిసిందేకదా?"........అయ్యాగారు నాకు తండ్రి సమానులు. అయ్యాగారికి దస్తరుఖానాలో ఉద్యోగము. ఆయన కక్కడ ఏమిపని ఉన్నదో నాకు తెలియదు. నజీమువారి అనుగ్రహమువల్ల సాలుసరికి వేయివరహాలు జీతం ఇస్తారట! కాని నేను వచ్చిన యీపది పన్నెండేండ్లనుండి ఆయన ఒక చిల్లిగవ్వయైన జీతం జేవడంనేను చూడలేదు. ఇప్పటికి దస్ సాలు జీతం అంతాబకాయియే అంట! ఇంటిలో ఎప్పుడు భోజనము అరగించి వెడలిపోవుదురో, కాని ఆయన పొద్దస్తమానము, రాత్రియుగూడ నెప్పుడు ఆ దస్తరుఖానాలోనే నివాసము. అయ్యాగారు ఎప్పుడువత్తురో, యెపుడు బోవుదురో నాకుకూడ సరిగా తెలియదు. అయ్యాగారి అనుగ్రహంకొఱకు పది పండ్రెండేండ్లనుండి యిక్కడ పడిగాపులు గాయుచున్నాను." అని సవినయముగ దెలిపెను.

ఆవాక్యములాలకించి, పెద్దిభట్టు శూన్యాకాశమువంక కొన్ని క్షణములు దృష్టినిగిడ్చెను. పిదప నొక దీర్ఘనిశ్వాసముతో "రేపు నీకు అయ్యాగారిదర్శన మయినపుడు, కృష్ణాతీరవాసుడొక బ్రాహ్మణుడు దైవజ్ఞుడువచ్చి వేచియున్నాడని నామాటలుగా విన్నపము చేయుము" అని కోరెను.

౪

దైవజ్ఞుడగుటచేత పెద్దిభట్టు, మారయపంతులు మరునాడు ఇల్లు వెడలి దస్తరుఖానాకు పోవువేళనుగణించి తెలుసుకొనెను. ఆవేళకు ముందుగానేతాను అయ్యాగారింటికిజని మొగసాలలో అక్కడ జేరియున్న బ్రాహ్మణ సమూహముతోపాటు చేరి నిలువబడియెను. అక్కడ సమావేశమయిన విప్రసంఘము అతిమధురముగా వేదము చదువుచుండెను. వారితోగలసి పెద్దిభట్టుకూడ, నొక పన్నస వందుకొని ఘనచెప్పి, వేదోక్తముగా మారయపంతులుగారిని అందరికంటె ముందుగా నాశీర్వదించెను.

వచ్చిన బ్రాహ్మణ పండితవర్యులను, మారయపంతులు సముచిత రీతిని సంభావించి, కడకు పెద్దిభట్టు దిక్కు మొగమయి, తేరి పారజూచి "తమ దేయూరు? అని ప్రశ్నించెను.

పెద్దిభట్టపుడు" మాది కృష్ణాతీరము, మాది యేయూరని విన్నవింపను! నాసంగతి యిపుడెందులకులెండు! కాని నామాటలు సావధానంగా ఆలకించండి. ఇది ఆషాఢ మాసముగదా. ఈ ఆషాఢము మొదలుకొని ఆరుమాసముల నాటికి పుష్యబహుళ ద్వాదశి నాటికి చూడండి: జ్ఞప్తియందుంచుకొని పరీక్షించండి. తమకు తలవని తలంపుగా నొక మహాయోగము పట్టనున్నది. ఈ దినమున చూచిన చల్లనిచూపుతో ఆనాడుకూడా, తమకు మహోన్నత పదవి వచ్చిననాడు ఈ దీనుణ్ణి, యీ దరిద్రుని, ఆదరింపమని ప్రార్థన. ఆనాడు నాయందు తమ కనుగ్రహముంటే, తమకు నా విషయము జ్ఞాపకముంటే నాపుట్టుపూర్వోత్తరము అన్నింటిని సవిస్తరముగా మనవి చేసుకొంటాను" "అనుచు గంభీరముగ నుపన్యసించెను.

ఆమాటలకు మారయపంతు లొకింత చకితుడై, రెండు క్షణముల కాలము మారుమాటాడలేక, విశ్వాస సంశయముల నడుమ ఊగులాడెను. తుదకు ఏనిశ్చయమును దోచకపోవుటవలన, బాగు! తెల్పగానున్నది. చనుడు, నేటికి చనుడు. చనుడు. అనుచు సంభావింపబోయెను. పెద్దిభట్టు, 'నాకేమియు నేడు వలదు అనుగ్రహముండిన నంతయు నాడే యొసగవచ్చును" అనుచు మారయపంతు లొసగవచ్చిన సువర్ణమును ప్రతిగ్రహింపడయ్యెను. అయ్యగారు వల్లెయనుచు, మారుమాటాడక తటాలున తలవాకిటకుజని యచ్చట సిద్ధముగానున్న మేనాసవారినెక్కి తృటిలో సందుగొందుల నడుమను మాయమయ్యెను. అప్పటికి సాయంకాలమయి నల్దెసల చిమ్మచీకటులు క్రమ్మెను. ఆనాడు మొదలుకొని పెద్దిభట్టు సరిగా మారయపంతులు ఇల్లు వెడలు సమయము కనిపెట్టి, తనకెంత యితర పనియున్నను ఆవేళకు మాత్రము వారింటికిజని, అయ్యగారు పల్కరించకపోయినను, దర్శనమాత్రము చేసి, వేదోక్తముగా నాశీర్వదించి వెడలిపోవుచుండెను. తొలినాడు పలుకరించుటకప్ప మరియెన్నడును, మారయపంతులు పెద్దిభట్టును పలుకరించిన పాపమునబోలేదు.

పెద్దిభట్టునకు కొన్నాళ్లు గతించునప్పటికి, ప్రాణము విసిగిపోయెను. "ప్రతిదినమును, వేళయు పాళయులేక, కొంపమునుంచుకొని పోవుచున్నట్లు మారయపంతులు దస్తర్ ఖానాకు మేనాయెక్కి పరుగు పరుగున బోవుచున్నాడు. అక్కడ నా అయ్యగారి కొలువెట్టిది?' అను సంశయము గాఢముగా కలిగెను. దస్తర్ ఖానాకరిగి, అక్కడ నయ్యగారు చేయుపనులను జూడవలయునని కుతూహలము కలిగెను. కాని ఆ మహానగరములో నా పాపనయ్యకు దస్తరుఖానా యెక్కడనున్నదో తెలుపజాలినవాడు కనబడలేదు. ఒకదినమున నాతడు సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయము వేళవఱకు దస్తరుఖానా యెక్కడనున్నదని కనబడినవారినెల్ల అడుగుచు బోయెను. అతని కెక్కడనుకూడ సరియైన యుత్తరము రాలేదు. ఒకచోట ధూర్తుడొకడు ఎంతచెప్పినను వినని యా విప్రునిగాంచి, పొమ్మని గదిమి చేయిచేసుకొనుటకు సయితము సిద్ధమయ్యెను.

పెద్దిభట్టు చివరకు ఇదిగాదు పనియనుకొనెను. మరునాడు మారయపంతులుగారి మేనా సవారి వెనుకను దవ్వుదవ్వుల నుండుచు ఝామునేపు నడచుచు దస్తరుఖానాను గాంచగల్గెను. ఆదస్తరుఖానాయెదుటను ముసలి గుల్బవుసవారు ఒకడు పహారా తలాయించుచుండెను. వచ్చుచు బోవుచున్న వారిని ఆపుచు, పరికించుచు, తృప్తిచెందినట్లు "సబ్ అచ్ఛా" అనుచు మాటిమాటికి తనలో గొణుగుకొనుచుండెను.

పెద్దిభట్టు గుల్బపు రౌతును సమీపించి ఉచితరీతిని సలామొనరించి పలకరించెను. పారశీక భాషలో తిమరెవ్వరని యా బ్రాహ్మణుని సవార్ సాహేబు కుశలప్రశ్న చేసెను. అంతట పెద్దిభట్టు! సవ్వార్ సాహెబుగారు, తమకొక శుభము చెప్పవచ్చును. తమకు త్వరలో నొక మహాయోగము పట్టనున్నదని యుపశ్రుతినాకు తెలుపుచున్నది. తమకు రేపువచ్చే పూర్ణిమనాటికి అనగా సరిగా నేటికి నిరువదియేడు దినములకు, గోల్కొండ ఖిల్లాకు ఖిల్లేదారిదర్జా రాగలదు. మీ మామగారి యుద్యోగము మీకు మీ బీగంసాహెబావారి అదృష్టవల్ల కలుగనున్నది" అని జోస్యము చెప్పెను

"తమరు జోస్యులా? సెబాష్"! అని రౌతుసాహెబు సంతుష్టాంతరంగుడయి గడ్డమును సవరించుకొనెను.

"తమవల్ల నాకొక స్వల్పమగు పనికావలసియున్నది. కోరమని సెలవైనచో?" అని పెద్దిభట్టు ప్రారంభించెను "అయితే బమ్మన్ సాబ్. నాకు ఖిల్లేదారు అవుతుంద? సబ్ అచ్ఛా? అవును అవ్వాలి మాకు?" భేష్, సెబాష్ తమకు ఇపుడు ఏంకావాలి మావల్ల ఉపకారము? అని సాహేబు అడిగెను.

"మారయపంతులు, కాను అయ్యగారు., కాదు మారోపంతు గారి దర్శనము నాకిప్పుడు చేయించవలెను." అని పెద్దిభట్టు కోరెను.

"అది నావల్లగానిపని! ఆయన లోపలికి పోయిన తరువాత, ఎవ్వరిని లోపలకు రానియడు. ఆదస్తరు ఖానాలో ఏం చేస్తుంటాడో, ఆయనకే తెలియాలి. ఇప్పుడు అక్కడ నజీముసాహెబు లేడు. నాయబులేడు. ఆయనయే, నాయబు నజీము, ఆయనయే గుమాస్తా, ఆయనయే దర్వాన్, ఆయనయే జవాను, ఆయనయే శెట్టియాన్, అంతా ఆయనగారే చూసుకొంటున్నాడు. గోల్కొండపాదుషావారికి ఈ దేశాలన్నిటినుండీ యెంత జమా అవుతుందో ఎంతఖర్చు అవుతుందో ఆయనకే తెలియాలి" అని రౌతుసాహేబు ఆశ్చర్యము వెలిగక్కు కండ్లు జూపుచు జవాబు నొసంగెను.

ఆమాటయు నీమాటయు చెప్పి, యెటులనో సవ్వారుసాహెబు, అనుగ్రహము సంపాదించుకొని పెద్దిభట్టు దస్తరుఖానాలోనికి మెల్లగా ప్రవేశించెను. ఆదస్తరుఖానాకు ఒకటే దర్వాజా. కిటికీలు

చాలాయున్నవిగాని అవియన్నియు ఏడడుగుల ఎత్తునున్నవి. దర్వాజా మూయబడియుండెను. మెల్లగా అక్కడనున్న పరికరముల సహాయమున పెద్దిఖట్టు ఒక కిటికీవరకు ఎక్కి లోనికి తొంగి చూచెను. అలోపల అంతా చీకటుగా నుండెను. ఆ చీకటిలో చిన్న దీపపు వెలుగున మారయ పంతులు దస్తరములను తిరుగవేయుచు అందుండు కాగితములను తదేక దృష్టితో పరీక్షించుచుండెను.

౫

సుల్తాను అబ్దుల్లా కుతుబుషాకు ఒకనాడు మబ్బులేని పిడుగువంటి వార్త యొకటి ఢిల్లీనుండి వచ్చెను. ఆవార్త వచ్చినప్పటినుండి సుల్తానుకు నిద్రాహారములు లేకుండ పోయెను. మీర్‌జుమ్లా చేసిన రాజద్రోహము వలన ఔరంగజేబు వలన తాను పడ్డ పాట్లన్నియు జ్ఞప్తికి వచ్చెను. ఇప్పుడతనికి ప్రాణోపద్రవమయినంత భీతి పుట్టెను. ఆలంగీరు పాదుషా, తనకు గోల్కొండ సుల్తాను చెల్లింపవలసిన కప్పము, పది యేండ్లనుండియు పంపుట లేదనియు, దానినంతయు లెఖ్ఖ చూచి ఒక్క సారిగా నిప్పుడీయవలసినదనియు, నట్లు చెల్లింపని యెడల సుల్తానుని పదచ్యుతుని జేయవలసినదనియు నాజ్ఞల నొసగి నవాబు షయస్తఖానుని పెద్ద సైన్యముతో డిచ్చి పంపెను.

వెనుక షహజహాను పరిపాలనము చేయుచుండిన నాడు ఔరంగజేబు దఖిణీసుల్తానులను పీడించెను. రాజద్రోహుల సహాయమున వారి నోడించి, దయమాలి, చెఱబెట్టి అనేకరీతుల హింసించెను. యేయేట వచ్చు నాదాయముపై నింతచొప్పున కప్పము చెల్లింతునని వ్రాసజేసి సంధి చేసుకొన్నప్పుడు, అతడు సుల్తానుఅబ్దుల్లాను మరల సింహాసనముపై నెక్కించెను. పిదప ఔరంగజేబు ఢిల్లీకి వెడలిపోయెను. ఆనాడు మొదలు మొగలాయి సామ్రాజ్యము కడగండ్ల పాలయ్యెను. షహజహాను కుమారులు సింహాసనమునకై తమలో తాము పెనగులాడిరి. తుదకు ఔరంగజేబు సోదరుల నెల్ల వంచించియో, ద్రోహముచేసి ఓడించియో, చంపియో, ఢిల్లీసింహాసనము నధిష్ఠించెను. పిమ్మట తండ్రిని చెఱసాలయందుంచెను. అకష్టదినములలో ఢిల్లీపాదుషా యొక్క దుస్థితిని గ్రహించి సుల్తాను అబ్దుల్లా ఢిల్లీపాదుషాకు కప్పము గట్టుట మానెను. అల్లొంతకాలము హాసెనో లెక్క తెలుపువా రెవ్వరును లేరు. ఇప్పుడు పాదుషాకు చెల్లవలసిన కప్పమెంతో కూడ ఎవ్వరును చెలుపజాలరు.

షయస్తఖానుడు తొందరబెట్టకుండ అంచ మిచ్చి, సుల్తానుకానిని రెండువారములు లాపెను. పాదుషా పంపిన లెక్కప్రకారము కప్పము గట్టవలసి వచ్చినయెడల, గోల్కొండరాజ్య మంతయు నమ్మినగాని యా బకాయి తీరదు. అంతట సుల్తాను మిక్కిలి వ్యాకులచిత్తుడై దస్తర్‌ఖానా నజీము ఖ్వాజా నజరుల్లాఖానునకు కబురంపించెను. కాని యాతడు రోగపీడితుడయి, రెండు సంవత్సరముల నుండి, నోట మాట లేక, కాలు కదల్పజాలక, మంచము పట్టియున్నాడనియు, దస్తరుఖానావైపు గూడ పోవుటలేదనియు, వార్త వచ్చెను.

అశక్తతతోపాటు కోపము పొంగి పారలి వచ్చినపుడు, నదుడెట్లగునో ఆనాడు సుల్తాను అబ్దుల్లా అట్లయ్యెను. కోపము చల్లారిన వెనుక వజీరు ఖ్వాజా అబ్దుల్‌గిలానీ మెల్లగా సుల్తాను వారికడకు జని సముచితరీతిని సలాము లొనరించి, సంతసచిత్తుడైనవాని మనసును రంజింపజేసి, "జగత్ప్రభువులు చింతింప నక్కఱలేదు. దస్తర్‌ఖానాలో గుమాస్తా మారోపంతు ఉన్నాడు.

ఆయనవల్ల మనకు ఏమయిన పని కొనసాగునేమో యని ఆశతో నున్నాను. పంతులుకొరకు కబురంపించినాను. ప్రభువువారు అనుగ్రహించినచో నింతలో నిక్కడకు రావచ్చును" అనుచు పారసీ భాషలో విన్నవించెను.

సుల్తానువారి హుకుం అయినదని తెలిసినతోడనే మారయపంతులు దివాన్-ఇ-ఖాసునకు ప్రయాణమయ్యెను. ఎఱ్ఱచారలు, జరీపువ్వులుగల పచ్చరంగు పట్టుషరాయిని దొడుగుకొనెను. ఎఱ్ఱని పట్టుతో చేయబడిన నిలువుటంగీని వంట నంటియుండుదానిని ధరించెను. నడుమునకు ఒక లేతగులాబి మొఖమల్‌పట్టు కాశెను చుట్టుకొనెను. శిరమునకు బందరు సెల్లా యొకటి జరీపువ్వులుగలది, అక్కరంగు అద్దినది, కడు వింతగా కోరపాగా జుట్టెను. ఒకచేతిలో రుమాలు పట్టుకొనెను. కుడివైపున మొలలో కైజారు పెట్టుకొనెను; ఎడమచంకలో దస్తరము నిడుకొని పాలకి యెక్కి దివాన్-ఇ-ఖానునకు వడిగా పయనమై ప్రవేశించెను.

మారయపంతులు యథోచితముగ సింహాసనము నెదుట, సాష్టాంగముగ సలాము లొనరించి, నిలువబడి, సుల్తాను ఆజ్ఞకు ఎదురు చూచుచుండెను. సుల్తాను ఆ బ్రాహ్మణునివంక అనుగ్రహముతో దృష్టి నిగుడ్చెను; కొన్ని ముహూర్తములు అట్లు గడచిపోయెను. పిదప సుల్తాను వజీరువంక చూచెను. వజీరు సుల్తానువారి చిత్తమును కనుసన్నలను గ్రహించి మారయపంతులును ప్రశ్నించెను.

అపుడు మారయపంతులు వినయముతో దస్తరము క్రిందనుంచి, వంగి ముమ్మారు సలాములు చేసి చేతులు జోడించి పారశీభాషయందు "జగత్ప్రభూ! అనుగ్రహించి అవధరింపుడు! దస్తరుఖానాయందు ఈ భృత్యుడొక చిన్నగుమాస్తా! ఈ సేవకునిపై ఏలినవారికింత అనుగ్రహము కలిగినందులకు అల్లావారికి శతసహస్రానేక కృతజ్ఞతావందనములు. ఈ భృత్యుడు నేడు ధన్యుడైనాడు. అల్లావారి అఖండప్రేమకు పూజ్యులయిన జగత్ప్రభువులు ఎప్పుడును పాత్రులుగదా! నిరంతిరము ఏలినవారికి శుభములు పరంపరగ నయ్యెడుగాక. జగదేకప్రభువులు ఇపుడు దయతో అవధరింతురుగాక! ఖ్వాజా మహమ్మదు నజర్ ఉల్లాఖాను సాహెబుగారు వ్యాధిపీడితులయినది మొదలు క్రొత్త నజీము ప్రభువువారిచే నియోగింపబడలేదు. ఆయన వ్యాధికి నాలుగు మాసములక్రితమే నాయబు నజీము అసదుల్లా సికందరు యిస్పహానీగారు మృతినొందిరి. కాని

స్థానమున గూడ నెవ్వరు నియోగింపబడలేదు. దస్తురుఖానాయందు అయిదుగురు గుమాస్తాలు గలరు. వారిలో నలుగురు ఒకరు మజ ఫరునగర సర్కారునకును, రెండవవారు, శ్రీకాకుళం సర్కారున కును, మూడవవారు కొండవీడు సర్కారునకును నాల్గవవారు నల్గొండసర్కారునకును లెక్కలనిమిత్తము వజీరుసాహేబుగారి ఆజ్ఞ గైకొని అరిగియుండిరి. ఇప్పటికి పదునెనిమిది మాసము లయినది. అప్పటినుండియు దస్తురుఖానాయందలి సర్వవ్యవహారములను ఈ సేవకు డొక్కడే చక్కబెట్టుకొనుచున్నాడు ఏలినవారి దివ్యచిత్త మును వజీరుఖాను సాహెబుగారు ఈ భృత్యుని కొన్నాపించి యుయున్నారు. ఏలినవారు ఢిల్లీ ఆలంగీరుపాదుషావారికి ఏడేండ్ల కప్పము ఏడులక్షల ఎనభయి అయిదువేల అరువందవల ముప్పదినాలుగు వర హాలు మాత్రమే గట్టవలసియున్నది. దాని కంతకును జమాఖర్చు తయ్యారుజేసితిని. వజీరుఖాను సాహెబుగారు పరిశీలించెదరుగాక. దీనికి ఢిల్లీకి బోయినను తిరుగు లేదు. నిన్న సాయంకాలము నవాబు జంగుబహాదూర్ షయస్తఖానువారి వజీరు వాలీఖాను ఖానుబహాదూర్ వారు పరీక్షించి సెబాసని అంగీకరించినారు. ఈ భృత్యుని జమా ఖర్చు లెక్కవలన జగత్ప్రభువులకు పందొమ్మిది లక్షల వరహాలు లాభము కలిగినది.'' అనుచు వచించి కాగితములను వజీరుసాహేబు వారి యెదుట బంగారుపళ్ళెరమందుంచి వంగి మరల ముమ్మారు సలాములు చేసి, వినయముతో శిరము వాల్చి నిలువబడెను.

సుల్తాను అబ్దుల్లా సంతుష్టాంతరంగు డయ్యెను. అంతట నొక సారి వజీరుసాహెబు ఖ్వాజా గెలానీవంకను, మరియొకసారి మారయపంతులు వంకను కటాక్షవీక్షణములు బఱపి 'సెబాష్' అని యెను. అపుడు వజీరుసాహెబు సముచితరీతిని వంగి సలాములుచేసి, చేతులు ముకుళించి పారశీభాషయందు ఇట్లు ప్రశంసించెను.

''జగదేక ప్రభువులు సావధాన చిత్తులయి అవధరింప వేడుకొను. ఏలినవారి సేవకుడు మారయపంతులు జగత్ప్రభువులకు పరమాప్త భృత్యుడు. రేలనక, పవలనక, చలియనక, వానయనక, చీకటి యనక, బడలికయనక నిద్రాహారములు మాని, ఒంటరిగ, నాలు గేండ్లనుండి యొక్కరీతిగ, క్లేశములకు లోనయి, విసుగు విరామ ములులేక, మినుకు మినుకు మనుచుండిన యొక గ్రుడ్డిదీపమును బెట్టు కొని, దస్తరములను తిరుగవేయుచు, కన్నులు గలవారికి వెలుగులో సయితము కానరాని అక్షరములను కాగితములపై చదువుచు నెప్పటికప్పుడు జమాఖర్చు వ్రాసియుంచి, యిపుడు అడిగిన వెంటనే ప్రభువువారికి లెఖ నివేదించినాడు. ఈతడు చీకటిలో గూడ చదువను వ్రాయను నేర్పరితనముగల దిట్టడు. విశ్వాసముగల సేవకుడు. జగత్ప్రభువుల దయకు నిస్సంశయముగ పాత్రుడు.''

౩

మరి నాలుగైదు దినములలో షయస్తఖానుడు గోల్కొండ సుల్తానీయవలసిన కప్పమును బుచ్చుకొని తన పరివారమును తరలించుకొని పోయెను. పాదుషా సైన్యములు వెడలిపోయినవాడు సుల్తాను అబ్దుల్లా సుఖవినోద గోష్ఠియందుండి యెప్పటియట్ల కొలువు దీరెను. ఆనిండు కొలువునందు మారయపంతులును దగ్గరకురా పిలి పించి సుల్తాను చిత్తవృత్తినెఱిగి ఆయనమాటలుగా, వజీరు ఖ్వాజా గెలానీ, ''నీ ప్రభు భక్తి పరాయణతకును, నీ సేవకును మేము మిక్కిలి సంతసించినాము. మా సంతోషమును తెలియజేయుటకై నేడు నీకు 'శబ్ నవీస్' అను బిరుదము నొసగుచున్నాము. చీకటి యందు సయితము దీపపు వెలుతురు లేకయే చూడగల ప్రజ్ఞకల వాడని ఈమాట కర్థము. ఇపుడు పారితోషకము క్రింద ఈ అమూ ల్యాభరణములను, ఈ రత్న కనకవస్తు సందోహమును, మేలయిన యీ పచ్చడములను, పట్టు అంగీలను అవలనున్న నాలుగు ఉత్తమా శ్వములను, నొసగుచున్నాము. ఇంతటనుండియు నిన్ను మాకు పర మాప్త భృత్యునిగ భావించి దస్తురుఖానాను వజీరు పదవి నొసగి నాము. అంగులకు జీతభత్యములకై నీకు సాలు ఒక్కంటికి పండ్రెండువేల వరహాలు ఆదాయము వచ్చునటుల మా నల్గొండ పరగణాలో జేరిన వేముగల్లు గ్రామమును జాగీరుగా మిక్కిలి దయతో నొసగినాము'' అనుచు వాక్రుచ్చెను.

అమున్నన సత్కారములకు మారయపంతులు పరమానందభరితు డయి, సముచిత రీతిని సాష్టాంగముగ సింహాసనమునకు ముంగిట సలాము లొనరించి సుల్తానువారి ఔదార్యమును, అనుగ్రహమును, వేయి విధముల పారశీభాషలో స్తుతించెను. తుదకు వినయముతో మరల ''జగత్ప్రభువులు పరమకారుణికులు; ఈదీనుని విన్నప మొకటి గలదు. అత్యంతకృపాయత్తచిత్తులయి అవధరింప వేడు కొనుచున్నాడు. అనుజ్ఞయగుచో విన్నవించుకొనును''అని వేడెను.

సుల్తాను వారి వదనముపై మందహాసము కొంతు తీసుమందుట గాంచి వజీరు ఖ్వాజామహమ్మదుగెలానీ, మారయపంతులు దిక్కు మొగము త్రిప్పి కనుసన్న జేసెను.

''జగదేకప్రభువులు అనుగ్రహింతురుగాక. ఈసేవకునికి పరమ మిత్రుడును, ఆశ్రితుడును, విద్వాంసుడు నగు బ్రాహ్మణముఖ్యు డొకడు గలడు. అతని పాండిత్యమును మెచ్చి పారితోషిక మీయ వలెనన్న ఈ భృత్యునికి శక్తి చాలదు. సర్వవిధములచేతను మహో దారులయిన జగత్ప్రభువులే సమర్థులు. అతడు 'దైవజ్ఞచూడామణి' అతని పూర్వులు ఈ యాంధ్రభూమి నేలిన కాకతీయులనాడును, రెడ్లనాడును సత్కారములంది అగ్రహారములు బడసినారు. వానికి పూర్వులు సంపాదించిన అగ్రహారము ఇపుడు పరాధీనమైనది. ఇపు డేలినవారి దివ్యచిత్తానుగ్రహమునకు ఎదురు చూచుచున్నాడు. అతని నామధేయము పెద్దిభట్టు. కృష్ణాతీరవాసి'' అని విన్నవించెను.

అంతట నొక మూలనుండి ఖిల్లేదారుడు, మహాబత్ ఖానుడు లేచి సముచితరీతిని వంగి సలాములొనర్చి, ''జగదేకప్రభువులు క్షమింతురుగాక. ఇవియే ఆనేక సాష్టాంగదండప్రణామములు. ఏలిన వారి యీ భృత్యునికి గూడ పండిత్ పెద్ది విద్వాన్‌గారి పరిచయ మున్నది. ఆయన నిస్సంశయముగ దైవజ్ఞచూడామణి అనవలసిన

వారు మహాపండితులు. వారి మహిమ కొంత ఈశ్వరునికిగూడ అనుభవ మయినది.” అనుచు విన్నపము జేసెను.

అపుడు సుల్తాను ఆశ్చర్యనిమగ్నుడై వజీరువంక జూచెను. వజీరు వినమ్రుడై “దేవర దివ్యచిత్తము!” అనియెను.

పిమ్మట జరిగిన వృత్తాంతమును రెండు మాటలలో దెలుప వచ్చును. కీలక సంవత్సర మాఘ బహుళ చతుర్దశినాడు, మారయ పంతులు సుల్తానుఅబ్దుల్లా కూలీ కుతుబ్‌షావారిచేత పెద్దిభట్టుగారికి మూర్తుజానగరు జిల్లాలో జేరిన పిడపర్తి గ్రామమును అగ్రహార ముగా ధారవోయించి దానము చేయించెను, బిరుదు నిశానీలతో పిదప సన్నదు నిప్పించెను. మూర్తుజానగరు పరగణా నేలుచుండిన సుబేదారు బుక్షీ మసయ్యాదు సిద్దీగారికి తాఖీదు పంపించునట్లు చేయించెను.

పదునారు బోయీలు గల్గిన రెండు సవ్వారీలపై నెక్కి, పెద్దిభట్టుగారును, అన్నమ్మగారును. ముప్పదిరెండు గుఱ్ఱపుసవ్వారుల సహాయముతో పిడపర్తి గ్రామమున కేతెంచి, తాలూకాదారునివలన అగ్రహారము నా స్వాధీనము చేసుకొనిరి. నాటనుండి పెద్దిభట్టు పిడపర్తి అగ్రహారీకు డయ్యెను. చిన్నవాడు తల్లిదండ్రులాగినట్లు కోరికలు సిద్ధించెను.

అమఱుసటి సంవత్సరమున పెద్దిభట్టునకు శుభముహూర్తమున పుత్రోదయ మయ్యెను. అతని సంతతివా రప్పటినుండి పిడపర్తివారై నేటివఱకు వైదిక శిఖామణు”లని ప్రఖ్యాతిగాంచి యున్నారు.

మారయపంతులుగారి వంశజులు ఆదిమొదట*‘శబ్‌నవీస్’ వారని పిలుచుకొనిరి. శబ్‌నవీస్ వారు కర్ణాటాంధ్ర మహారాష్ట్రదేశము లందు విస్తరించి యున్నారు. పెద్ద పదవు లొందియున్నారు.

పరిశిష్టము

ఈవృత్తాంతము క్రీ. శ. ౧౬౬౮ వ సంవత్సరమునాటిది. ఇందు కల్పన యెంత కలదో చరిత్ర కూడ నంతే గలదు. కాని కేవలము చరిత్ర యని శంకింపకలదు. ఆనాడు మొగలాయీసామ్రాజ్యము వతివైభవముతో అఖండతేజోబలదర్పితుడై, ఔరంగజేబు “ఆలంఘీర్” పాదుషా యని బిరుదము ధరించి, యేకచ్ఛత్రాధిపత్యముగ నిరంకుశుడై శాసించెను. ఆనా డుత్తరహిందూస్థానమునం దఖిలైశ్వర్య ప్రదమైనశాంతి స్థిరముగ నెలకొనియుండెను. కాని దక్షిణాపథమంతయు, తుపాను చెలరేగుచుండిన మహాసముద్రమట్లు భీతావహమైయుండెను. రాజద్రోహము కూడిన అశాంతి, పవన సహితుడైన పావకునియట్లు, బహుదిశలయందు ప్రబలి, దక్షిణాపథ మహారాజ్యములను భస్మీపటలము జేసియుండెను.

ఈకథ జరుగుచుండిన కాలమున, దక్షిణాపథమంతయు రెండు మహమ్మదీయ మహారాజ్యముల క్రింద చీలియుండెను. పశ్చిమమున, కర్ణాటమహారాష్ట్ర దేశములు బిజాపుర అదిల్‌షాహీ వంశమువారి పాలనమం దుండెను. తూర్పున, మహేంద్రగిరి మొదలుకొని చెన్నపట్టణ ప్రాంతమువఱకు వ్యాపించిన మహాంధ్రభూమి గోలుకొండ కుతుబ్‌షాహీ వంశజాల పరిపాలనము నందుండెను.

ఆనాడు బిజాపుర మహారాజ్యమును ప్రపంచ జ్ఞానమెఱుగని పసివాడు, తొమ్మిదేండ్లవాడు సుల్తాను సికిందరు అదిల్‌షా యేలుచుండెను. అఱువదినాలుగేండ్లు గడచిన వయోవృద్ధుడు, నిరంతర కామినీ విషయ లోలుడునగు సుల్తాను ‘అబ్దుల్లా కూలీకుతుబ్‌షా గోలుకొండ రాజ్యమును పరిపాలించుచుండెను. ఆకారణముల వలన నా రెండు మహమ్మదీయ రాజ్యములును ఎట్టి దుర్బలస్థితి యందుండవలయునో, యట్టి దుస్థితియందుండెను. ప్రజకు సుఖము లేదు. శాంతిలేదు. ధనధాన్య కనకవస్తు సమృద్ధిలేదు. ప్రభువులకు ప్రజ్ఞలేదు. బలములేదు. సౌఖ్యములేదు. మనశ్శాంతిలేదు. దుష్టులు మంత్రులైరి. సేనాపతులైరి, సుబేదారులైరి. చివరకు రాజద్రోహులైరి. అట్టివారి మూలమున బీజపూరు, గోల్కొండ మహారాజ్యములు కూలిపోయి. అంతరించిపోయెను. అదిల్‌షాహీలకును కుతుబ్‌షాహీలకు వైరము వర్ధిల్లెను. ఆనాడు అదిల్‌షాహీల దుర్బలస్థితిని బురస్కరించుకొని మహారాష్ట్రులు చెలరేగిరి. కొంకణమునందు శివాజీ మహారాజా స్వతంత్రరాజ్యమును స్థాపింపదలచి, మనోరథము నీడేర్చుకొనెను. శివాజీయొక్క పీచమణపదలచి, యీ వృత్తాంతము జరిగిన యిరువదేండ్లకు నిస్సహాయులైయున్న గోల్కొండ, బీజపుర మహారాజ్యములను ఆలంఘీరు సులభముగ జయించి తన సామ్రాజ్యమును దక్షిణాపథమునందు సయితము విస్తరింపజేసెను.

## హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం

తెనుగువారిలో అనేకమంది హిందీప్రచారానికి పెద్దపెద్ద విరాళాలిస్తూ వున్నట్టు పత్రికలలో వార్తలు కనపడుతున్నాయి. దాన్నిబట్టి వారంతా హిందీ యొక్క అవశ్యకాన్నిగాని, అది చేస్తూ వున్న అపకారాన్నిగాని గ్రహించే వున్నారని యెవరూ అనుకోకూడదు. కాంగ్రెస్సులో పేరుపొందినవారు అవిరాళాలు వసూలు చేస్తున్నారు. ఇచ్చినవారు వారినీ—వారి దేశసేవనూ చూచి యిస్తున్నారు. అంతే.

ఇంతేకాక : సర్వానికీ కాంగ్రెస్సునే నమ్ముకుని వున్నవారూ, హిందీప్రచారంకోసం జీతాలమీద నియమింపబడ్డవారూ, హిందీ ప్రచారం ద్వారా భుక్తి గడుపుకుంటూ వున్నవారూ తప్ప దేశవికా

* శబ్‌నవీస్ అనే పదమే యిపుడు సబ్‌నవీస్ అని వాడుకలో నున్నది.

సమూ, జాతీయతా కోరే తక్కినవా రందరూ హిందీవల్ల దక్షిణ దేశభాషలు—విశేషించి తెనుగు నష్టపడుతోందని గుర్తించారు.

కనక ఉత్సాహం గల మాదేశీయులు హిందీ దురాక్రమణం తగ్గేటట్టూ, మన తెనుగుభాష వృద్ధిపొందేటట్టూ చక్కని ప్రణాళికలు తయారుచేసి మాకు పంపకోరుతున్నాము.

—సంపాదకుడు

“భాషలోనే గాదు, వేషములోను, నడకలోను, నాడెములోను, తెలుగువారికి క్రొత్తమీద మోజు ఎక్కువ. ఈ మోజుకు సహజమైన వారి ఒళ్ళుతెలియని ఆవేశమూ, ఆరంభశూరత్వమూ, తోడై పరుగెడుతూ వుంటాయి. ఇంతేకాదు_అనుకరణానికి మురిసేవారిలో అభిమానానికి హస్తోదక మిచ్చేవారిలో, తెలుగువారు అగ్రగణ్యులు గూడాను. వర్తకసరళిలోనే గాదు_న్యూర్తకసమితులలోనే గాదు_సంఘసంస్కరణోద్యమాలలోనే గాదు_ సహాయనిరాకరణంలోనే గాదు_ సంవత్సరంలో స్వరాజ్యం తెచ్చే సమ్మర్దనలోనే గాదు_ సారస్వతసమాజాలలోనే కాదు_ స్థానికసంస్థలలోనే గాదు_ లైబ్రరీ మూవ్‌మెంటు మొదలు లైఫ్‌యిన్సూరెన్సు కంపెనీలలో వఱకు తెలుగువాఁడు వేలుపెట్టనిది గాని తెమల్చి గట్టుకు చేర్చింది గాని ఒకటైనా మచ్చుకు ఉన్న దనే పుణ్యం ఉంటుందా అని అడుగుతున్నాను. దాదాపు పాతిక సంవత్సరములనుంచి తెలుగువారిలో— ఆడువారిలోను మగవారిలోను,— పడుగుపేకగా పిత్తదోషపు బుర్రలోని భావాలలాగ, క్రొత్తనీటి ఒత్తిడిగల ప్రవాహములోని అటుపోటులలాగ, గలిగే వేషాలమార్పులు గమనిస్తున్నాం గదా! సులభంగా సంక్రమించే మార్పులు తెలుగువానికి తేలికగా పట్టుపడినన్ని హిందూదేశంలో మఱి ఏప్రాంతమువానికి పట్టుపడవు. క్రాపులంటూ ఆరంభించారు. బంగాళాక్రాపు మొదలు బర్మాక్రాపువరకు రకరకాల మార్చాడు. వేసాలమార్పుతో మీసాల మార్పు మొదలయింది. అందులోను ముక్కుక్రింద మూడువెంట్రుకలు మిగిల్చి ‘ఫ్రెంచికట్టు’ వరకు ముచ్చట తీర్చుకొన్నాఁడు. అంతలో నాగక నున్నగా వపనం చేయించుకోవడమే ఫాషనుగా దిగింది. ఇకను తలగుడ్డలు మారి హాసన్‌కాపులు, ఫెల్టుకాపులు వచ్చాయి. ఆతరువాత సైకిల్‌కాపులూ, తుర్కీటోపీలు మారిమారి పక్కపగిడీలూ; పంజాబుపేటాలూ, కొన్నాళ్లు ప్రభుత్వం చేశాయి. అనంతరం బోడితల మిగిలింది; గాంధీ కార్చాడు రేగినది మొదలు కొని ఖద్దరుకుల్లాయీలు వ్యాపించాయి. వాటికీ అవసానదశ వచ్చింది. చొక్కాయలలో, బట్టకట్టులలో ఖండువాల ఫిరాయింపులలో, కాలర్ నెక్‌టయిల సవరింపులలో చెలరేగిన రకరకాల తీర్పులూ చూచాము. ఇక స్త్రీల తలముళ్లలో మొదలు జాకెట్లలోను, చీరకట్టులలోను, బొట్టులలోను, నగలలోను, కలిగిన, కలుగుతూన్న మార్పులు లెక్కలేవుగదా! ఈలాటి వేసపుమార్పులు ఎన్నివచ్చినా ఎన్నిపోయినా ఘటము నేలపడేవరకు మార్పునేది లేకుండ ఉంటే మాటలో మాత్రం నిలుకడ ఉన్నంతవఱకూ తెలుగుజాతీయతకూ విలక్షణతకూ భంగము రాదు లెమ్మని మనస్సుకు సమాధానం చెప్పుకొన్నాము; చెప్పుకుంటున్నాం కూడాను. అలాంటిది చివరకు ఈ అటుపోటులలో మాట కూడా దక్కచూపు లేకపోతోంది!

ఎందులో చూచినా పరాధీనతే తెలుగువాణ్ణి దాసానుదాసుణ్ణి చేస్తూం దంటే సందేహించనక్కరలేదు. వేషంలో దాస్యం సరే సరి— భౌతికశరీరము మీఁదినుంచి భావనలోకి కూడా చొచ్చుకొన్నది. క్రమంగా భాషమీద ముట్టడి ప్రారంభమైంది. రాజకీయంలో సాంఘికంలో, మతంలో, వాఙ్మయంలో— ఎందులో చూచిన వేలంవెఱ్ఱే కనుపడుతోంది; వివేక మనేది చాలావరకు తెలుగువాణ్ణి వదిలేసిం దని వర్తమాన పరాధీనస్థితి ఘోషిస్తూంది. చూడండి!- క్రీస్తు మతాన్ని అవలంబిస్తూండే మాలమాదిగలకు సదరు మతతత్వం పూర్తిగా మనస్సున పట్టిం దనే చెప్పగలమా? అంటే మిషనరీల బోధనవల్లను, వారు పెట్టే ఆశలవల్లను భ్రమించి వ్యామోహంలో పడే క్రైస్తవమతావలంబకులే కనపడుతున్నారు. స్వమత—పరమతతత్వములను విచారించి ఆత్మవిశ్వాసముతో మతము పుచ్చుకొన్నవారు ఎంద రున్నా రంటారు? సహాయనిరాకరణోద్యమాన్ని ఒక్కమారు భావపథానికి తెచ్చుకోండి. గాంధీగారి దౌర్జన్యరహిత సత్యాగ్రహతత్వము దాని సాధనవిధానములను స్వరూపస్వభావములను పరిశీలించి మనఃపూర్వకముగా నమ్మి ఆచరించినవారు, ఖద్దరు కట్టి గాంధీటోపీలతో కాంగ్రెసు జండాలతో జేజేధ్వనులు చేసికొంటూ ఉపన్యాసరంగాలమీద పరవళ్లు తొక్కినవారిలో. కఱ్ఱదెబ్బలకు గురియైనవారిలో, ఖైదులకు వెళ్లినవారిలో ఎంద రుంటారు.? అంటే ఆవేశపు హోరుగాలితో ఎగిరిన వ్యక్తులే మూడుముప్పాళ్లు ఉన్నారంటే తగాయిదా పెట్టేవా రుండరు గదా! తెలుగువారి వివేకకార్శ్యమునకును వేలంవెఱ్ఱికిని దృష్టాంతంగా ఇంతకథ వ్రాయవలసివచ్చింది.

ఈలాగ ఆత్మవిలక్షణత అంటే ఏమిటో తెలియక ఆవేశవాయువులకు చిమ్మకొనిపోయే తెలుగువారు తమ మాతృభాష నుపేక్షిస్తున్నా రంటే, క్రొత్తగా ‘హిందీ’ మోజులో పడిపోతున్నా రంటే, వింత యేమిటి? భారతదేశంలో దాదాపు ఇరువదైదుకోట్ల జనసంఖ్యకు పైగా హిందీభాష అయితే నేమి దానికి ఛాయ లైన మహారాష్ట్ర, గుజరాతీ, బెంగాలి, పంజాబీ లోనగు భాష లైతే నేమి మాట్లాడేవారు ఉన్నారని ఎఱుగుదుము. దేశాని కంతా సామాన్యభాష యొకటి అవసర మన్నమాట నిజము. ఆంధ్రులు, అరవలు, కన్నడీలు, హిందీభాషావ్యాసంగమున చాలినంత కృషి చేయవలసిం దని ఒప్పుకోనివా రుండరు. నామతము ప్రకారము ఒక హిందీమాత్రమే కాదు, కనీసము ద్రావిడభాష లన్ని తెలుగువానికి స్వాధీనము కావాలి. అట్లని స్వభాషయందు ఔదాసీన్యము, ఉపేక్షయు నేను సహింపజాలను. ఈమధ్య హిందీభాషాభ్యాసము

నకై చేస్తూన్న ప్రబోధాలు, పెడుతూన్న పరీక్షలు, రచిస్తూన్న గ్రంథాలు, ప్రయోగిస్తూన్న వ్యాఖ్యానాలు, నాటకాలు కనుపెట్టి చూస్తూనే వున్నాను. హిందీప్రచారకుల నానాముఖములైన కృషి కిన్ని దీక్షకున్ను మెచ్చుకుంటున్నాను. ఇతరభాష నేర్చుకొనుట యనిన కంటకప్రాయముగ తలంచే తెలుగువారిలో స్త్రీలలోను, పురుషులలోను హిందీభాషయందు ప్రీతి అంకురించడము శుభోదర్కమే యని ముచ్చటపడుచున్నాను. "ఆంధ్రపత్రిక" "కృష్ణాపత్రిక" మొదలగు తెలుగుపత్రికారత్నములు హిందీభాషావ్యాప్తికి సర్వవిధముల ప్రోత్సాహము ఒసగతుండడము గమనిస్తున్నాను. హిందీప్రచారప్రవాహమున బడి మునిగి వాటి వెంట బడి దొర్లిపోక ఆత్మస్మృతిలో మాతృభాషాభిమానముపై గురి నిలిపి నేటి హిందీభాషయొక్క ధాటికి మార్కొడ్డి నిలిచి తెలుగువారి మందగతి చూపులను స్వభాషమీదికి మరల్చుటకై అసహాయముగ సాహసిస్తుండే ఈ "ప్రబుద్ధాంధ్ర" యొక్క సమయోచితప్రజ్ఞకు సంతసించాను. ఈపత్రికా సంపాదకుడు నా మైత్రిని బురస్కరించుకొని, పండితుడను గాకున్నను తెలుగునుడిమీది నా అనురక్తిని పాటించి, నామతమును వెల్లడింపు మని కోరినాడు. ఆయన కోరిక దొరకపుచ్చుకొని నాకు తోచిన మాటలు వ్రాస్తున్నాను.

పైన వ్రాసిన వాక్యాలే, నాయభిప్రాయాన్ని వెల్లడించడానికి చాలు ననుకుంటాను. కాని వ్యంగ్యంగ వదిలేసే దానికంటే వాచ్యంగా చెబితేగాని జనసామాన్యానికి బోధపడ దేమో యని ఇంక కొంత వ్రాస్తున్నాను. హిందీప్రచారానికి వ్యతిరేకంగా ప్రబుద్ధాంధ్రలోను, ఈమధ్య ఆంధ్రకృష్ణాపత్రికలలోను బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (ప్రబుద్ధాంధ్రసంపాదకుడు) గారును శ్రీయుత టేకుమళ్ల కామేశ్వరరావు బి. ఎ. బియిడి గారు విశ్వనాథ సత్యనారాయణ ఎమ్. ఏ. గారును, అడవి బాపిరాజుగారును, యింకను మరికొందరు తెలుగుభాషాభిమానులున్ను క్రమంగా వ్రాసిన వ్యాసాలు —అనుకూలంగాను ప్రతికూలంగాను వ్రాసినవి—చదివాను. వాటిలో వారందరు, వెల్లడించిన భావాల కంటే మిగిలినవి నా ఈ వ్రాతలో ఉంటా యని తోచదు. కాని ఈమార్కొనేవారిలో నేనొకణ్ణి ఉన్నా నని తెలుపుకోవడానికి ప్రక్కపాటగా పనికి రావచ్చు.

తెలుగుభాష బాగా వికసిస్తూవుందని సంతోషిస్తూ యుండే వారు చాలామంది వున్నా జాను తెలుగు.— అంటే తెలుగునుడికారము చాలావరకు ఇగిరి ఎగిరిపోతున్న దని గమనిస్తుండేవారు చాల తక్కువగా కనబడుతున్నారు. ఈతక్కువ మందిలో గ్రాంధికభాషాభిమానుల మనుకొను వారే ఎక్కువమంది. "మీరు వ్రాసేది తెలుగుభాష కాదు, భావనలోను భాషలోను సాంకర్యము కనుపడుతూంది. అస్పలైన తెలుగుపలుకుబడి ఎఱిగి వ్రాసినవాడు తప్పక మేము నమస్కరిస్తాము. మీరు సంకరభాషను గ్రాంధికము అని సంతోషిస్తూ గ్రాంధిక మనే శబ్దాన్ని కూడా భ్రష్టము చేస్తున్నామని కూడా గ్రహించలేనంత మాఢ్యము మిమ్ము క్రమ్ముకొన్నది. ఈలాగ కృతకభాషను గ్రాంధిక మని పేరెట్టి మీరు భ్రాంతిలో పడటమే గాక లోకాన్ని భ్రమపెట్టడము న్యాయం కాదు, నిజమైన గ్రాంధికభాష నిర్వహించలేకపోతే శిష్టవ్యవహారభాషను అవలంబిస్తే శోషించిన కాస్త, పరుషమైన, మీతు. తెలుగుభాషకు దక్కుతుంది' అని గిడుగుపంతులు, బ్రతికియున్నన్నాళ్లు గురుజాడ పంతులు ఉద్ఘోషిస్తూ యుండే చిరుబురులాడే వారే కాని వారి వాదంలో వుండే గుణాన్ని గ్రహించనివా రింక ఉన్నారు గదా? ఈలాగ మాతృభాష ఒక దారి తెన్ను లేకుండ తన్నుకుంటుండంగా తెలుగుచదవడ మేమిటని పెద్దలు పిన్నలకు నిర్లక్ష్యభావం నేర్పుతూ వుండగా పాఠశాలలలో పరభాష కున్న ప్రాముఖ్యము, ప్రాశస్త్యము, మాతృభాషకు లేదని ప్రత్యక్షంగా కనపడుతూండగా, రాష్ట్రభాష కాబోతుందని హిందీని తెలుగువార బుర్రల లోనికి దూర్చడానికి ప్రయత్నిస్తున్నారు. కొంతవరకు వీరి ప్రయత్నం ఫలసూచకంగా మాత్రం ఉన్నట్టు కనపడుతూంది. ఇంక వీరి ప్రయత్నం అధికంగా ఫలించాలని మనఃపూర్వకముగా కోరే వారిలో నే నొకడను. ప్రస్తుతం రాజకీయభాషగా యుండే ఆంగ్లము అంతకంతకు విశ్వరూపము దాల్చి రాష్ట్రభాష లన్నిటిని కబళించినట్లు హిందీభాష మన తెలుగుభాషను మ్రింగివేస్తుం దేమో నని భయపడేవారిలో నేను చేరను. అయితే మన తెలుగువారికి స్వభాషమీద ఇప్పుడున్న ఈ కాస్త అభిమానము అడుగుచి యింకా కృశిస్తుం దని మాత్రం విచారం లేకపోలేదు. హిందీభాషాప్రచారానికి కంకణంకట్టుకొన్న నేతలను నేర్చుకోవలె నని ఉత్సాహపడే అప్పచెల్లెండ్రను, అన్నదమ్ములను నేను ప్రార్థించే దేమిటంటే: "కన్నమ్మ కడలుకడలుపట్టుకు ఏడిస్తూంటే పిన్నమ్మకు పెట్టరా పిండాకూడూ" అన్నట్టు ఇంటిభాషను ఉపేక్షించి దేశభాషను పూజించడము ధర్మకాదని రాష్ట్ర భాష కాబోతుం దని హిందీని సాధింపజూచినా, శబ్దవ్యుత్పత్తియు, పదసామరస్యమును, చాతుర్యమును, వాక్యరచనా నైపుణ్యమును, మొత్తము సాంప్రదాయమును— సారస్వత సమామ్నాయమును తెలిసికోటాని కని తెలుగు తోబుట్టువులయిన అరవము కన్నడము సమార్జించినా, స్వభాషకు పుష్టియు వికాసమును, కలిగించాలనే ప్రజ్ఞ కోల్పడ గూడ దని మనవి చేస్తున్నాను. ఈప్రజ్ఞ మనల్ని వదలనంతవరకు తెలుగునకు భయము లేదు. హిందీవంటి ఘనమైన భాష నేర్చుకొమ్మనే ప్రబోధములను గాని నేర్చుకొనగడంగు విద్యార్థులను గాని అడ్డుపెట్టుటకు అధిక్షేపించుటకు హక్కు ఎవరికి లేదని నే నెఱుగుదును. నానాటికి కృశించి విస్మృతమగుచున్న మాతృభాషను పూజింపు డని హెచ్చరించుటకు ప్రతిస్వభాషాభిమానికిని హక్కున్నది. ఆ హక్కు ఊతము చేసుకొని మరొక్కమారు తెలుగుమీది దృష్టిని తొలగించుకోవద్దని మనవి చేస్తున్నాను. చివరకు ఒక్క మాట— ప్రకృతము ఉపక్రమించిన, హిందీభాషా

స్వత్వమని అశక్తులవలె నని ఆక్షేపించే మాతృభాషావాదులు, తమకు నిజమైన ఆవేశము ఉన్నట్టయితే నిజమయిన తెలుగుభాషయందు అభిరుచి కలిగించుటకు రాచబాట ఏర్పరిచి పురావాసులను కృపపరిచే పద్ధతుల నాలోచించుటకు త్వరపడు డని, ఈవరకు జరిగిన తప్పునకు ప్రాయశ్చిత్తము చేసికోవలయు నని విన్నవిస్తున్నాను

—మున్నంగి శర్మ

హిందీప్రచారాన్ని గురించి రాయమంటే శర్మగారు స్వయం వ్యక్తిత్వం, ఆత్మగౌరవవిశ్వాసాలూ లేక, పరాయివాళ్లని అనుకరిస్తూ మనవాళ్లు అన్నివిషయాల్లోనూ యెలా చెడుతున్నారో వివరంగా వర్ణించారు. ఇలాంటి అనుకరణ పరాయణుల వలన కొంతేగాని ఈ హిందీ సర్వనాశనం చేస్తుం దని తేలే యెందుకూ చెప్పడం......

ఇప్పటిదాకా మనభాషని గురించి మనకి ఆవేదన లేకపోలేదు; కాని మన కింకా స్వస్వరూపజ్ఞానం పూర్తిగా కలగలేదు. మనకళ్లింకా మసక మసకగానే వున్నాయి. లేకపోతే పరభాషకోసం స్వభాషను— జాతీయభాషను— మాతృభాషను వదులుకోవాలి దని మనవాళ్లకే చెప్పవలసిన ఖర్మమునకు యెందుకు వస్తుంది! ఇరుగమ్మని, పొరుగమ్మని ఆశ్రయించి మనవాళ్లే మనభాషమీద దండెత్తడం యెందుకు వస్తుంది? అయినా యింతవరకూ తప్పు లేదని మేము ఒప్పుకుంటాము. అందుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలంటే కూడా సంతోషమే అంటాము. అయితే ఆ ప్రాయశ్చిత్తం యిదివరకే ప్రారంభమయింది. శర్మగారు దానికి వేరే మార్గాలు నిర్ణయించ నక్కరలేదు.

సంపాదకుడు

---

# వ్యాఖ్యానములు

## పోటీ మంచిదే; కాని విషఫలం ఇస్తుంది

వరకే ఆంధ్రనాటకకళాపరిషత్తువారు నాటకాలు పరీక్షచెయ్యడానికి స్థిరపరుచుకున్నారు.

తమ పరీక్ష కాగిన నాటకానికి వారు వెయ్యిన్నూటపదహార్లు బహుమతిచేస్తారు.

నిజానికి బహుమతిమొత్తం చాలా పెద్దదే. ఇప్పట్లో మహారాజులు కూడా ఏఆంధ్రకవికీ చేస్తూ ఉండనిదే, కాని కళని ముందు చికాకుపరిచి తరవాత పూజించతలుచుకున్నారు వారు.

ఇది వాఙ్మయాని కపాయకర మనే సూచన వారికి నచ్చలేదు. పైగా వారిని సమర్థిస్తూ "వెయ్యిన్నూటపదహార్లిచ్చేటప్పుడు పరీక్షచెయ్యడం తప్పా?" అంటూ కొందరు కవులు మాదలకించారు కూడాను.

పరిషత్తువారికి మేము అహమికను ఆరోపించడం లేదు. ఈపోటీ యేర్పరచడంలో వారి వుద్దేశం యెంత గొప్పదో, ఆంధ్రవాఙ్మయ వికాసం విషయంలో ఎంత ఆవేదనతో కూడుకొని వుందో మేము గుర్తించికూడా వున్నాము. అయితే: వారు తొక్కిన త్రోవ మాత్రం ముళ్లతో నిండి వుంది. పైగా అది తీసుకుపోయి తీసుకుపోయి కీకారణ్యంలో విడిచిపెడుతుంది.

వెనక విజ్ఞానచంద్రికాగ్రంథమండలివా రేర్పరిచిన నవలల పోటీ దేశంలో వైముఖ్యానికి బీజావాపన చేసింది. పిఠాపురం మహారాజావారి ప్రబంధాల పరీక్ష మంచి ఫలితం యివ్వలేకపోవడమే కాదు, నిలిచికూడా పోయింది. మొన్న మొన్న ఏర్పడిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి నవలలు వగైరాల పోటీ కూడా ప్రశంసాపాత్రం కాలేకపోయింది.

ఇలాగ ఇన్ని అపజయాలు చూసిన్నీ పరిషత్తువారు అసలువిషయంలో నిశ్చలచిత్తగానే ఉండిపోవడం యేమీ బాగా లేదు.

కొంచెం నిదానించగలిగితే తా మేర్పరిచిన పద్ధతి పరీక్షకి అనుకూలం కాదని పరిషత్తువారికే తెలిసిపోతుంది. ఏమంటే? నాటకరచనలో కవులు తీసుకోవలసిన యితివృత్తం సాంఘికం కావాలన్నారు, కాని వారు, ఖలానా ఘట్టం అని నిరూపించ లేదు. ఈ స్వాతంత్ర్యాన్ని పురస్కరించుకొని కవులు తమతమ రుచులకూ, ఉద్దేశాలకూ సరిపోయే ఘట్టాలు ఎన్నుకొంటారు. దీనివల్ల పోటీచేసే కవులకు ఇతివృత్తంలో ఐక్యం పొసగదు. వస్తువు ఏకటి కానప్పుడు మంచిచెడ్డలు నిర్ణయించడం యెలాగా?

మామిడిపండు బాగుంటుందా, పనసతొన రుచిగా వుంటుందా? దేన్ని కాదని దేన్ని పుచ్చుకోవడం?

సమర్థులైన కవులు నిర్వహిస్తే ఏఘట్టాని కాఘట్టమే రసవంతం అవుతుంది. అలాంటప్పుడు ఉత్తమాధమత్వాలను నిర్ణయించడానికి పరీక్షకుల వ్యక్త్యభిరుచులే ప్రమాణాలు కావలసివస్తుంది. ఇది అపాయకరం కాదూ? పరిషత్తువారు ఇది ఆలోచించారా?

ఇది యిలా వుండగా: ఈ పోటీకి చాలామంది కవులు సిద్ధపడతారని మేము నమ్ముతున్నాము. వారందరిలోనూ వొకరికే విజయం.

ఒకరికే సత్కారం. తక్కినవారి నాటకాలమీద అధమా లని పరిషత్తువారి మాయని ముద్ర పడిపోతుంది, వాటి గతి యేమిటి? బాధ్యత కల పండితబృందం తీసిపారెయ్యడంవల్ల వాటిని ప్రకటన కర్త లెవరూ ప్రకటించడానికి సాహసించరు. పరాభూతులై వుంటారు; కనక సొంతంగా ప్రకటించుకోడానికి తత్కర్తలు కూడా సాహసించలేకపోవచ్చు. ఇలా జరిగితే ఆ నాటకా లన్నీ రూపు మాసిపోవలసిందేనా?

అథవా: ఆ గ్రంథకర్తలలో కొందరు దేశం అంతటా ప్రకాశిస్తూ వున్న పరశృతపండితుల ధర్మనిర్ణయం ఆసించి సొంతంగా ప్రకటించుకుంటా రనుకుందాం. అలాంటప్పుడు పరిషత్తువారి పండితుల నిర్ణయం కలుషితంగా కనపడుతుం దేమో?

ఇదీకాక: స్థానం నరసింహారావుగారు ఈ సందర్భంలో వొక వ్యాసఘట్టం కనపరిచారు. అదేమి టంటే? పండితులు చక్కగానే పరిశీలించి వొక నాటకం ఉత్తమం అని నిర్ణయిస్తారు. అయితే అది ప్రదర్శనానికి అనుకూలంగా వుండదేమో? పరిషత్తువారు ప్రదర్శనం ద్వారా కూడా నాటకాలను పరిశీలిస్తా మని యెక్కడా చెప్ప లేదు. అలా చెయ్యకపోతే రసాభాసం తప్పకపోవచ్చు.

ఎటుచూసినా యీపోటీపద్ధతి విషఫలం యిచ్చేటట్టే కనపడుతోంది.

ఇంతికీ: పరిషత్తువారు, ప్రపంచం అంతటా కొనియాడబడుతూ వున్న నోబుల్ బహుమాన పద్ధతిని ఎందు కవలంబించరూ?

చివరికి............?

---

శ్రీమతి పొణకా కనకమ్మగారు తమ ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సు సంఘసభ్యత్వం విడిచిపెట్టేశారు.

పైపెచ్చు, ఆమె, ఆసంఘంలో సభ్యురాళ్లుగా వున్న తక్కిన స్త్రీల నందర్నీ బయటికి వచ్చెయ్యవలసిం దని అజ్ఞాపిస్తున్నారు.

ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సు కార్యసంఘంయొక్క కార్యదర్శి పదవులలో వొకటి స్త్రీల కివ్వనందుకు ప్రయోగించబడ్డ ప్రతిష్టంభనం యిది.

ఉచితంగానే వుంది.

కాంగ్రెస్సులో ప్రముఖులై వున్న పురుషులు అంతఃపురాల్లో వున్న స్త్రీలనూ వీధికి తెచ్చారు. కద్దరుమూటలు బుజాలకెట్టి యింటింటికీ తిప్పారు. దుకాణాల దగ్గిర పికెటింగు చేయించి లాఠీ దెబ్బలు తినిపించారు. జెయిళ్లకి పంపించి యమచెర అనుభవింప చేశారు. అసెంబ్లీయెన్నికల్లో తమకి వోట్లు సంపాదించడంకోసం ఏజెంట్లుగా వుపయోగించుకున్నారు. ముందు కూడా వారి నింకా అనేకవిధాల అజ్ఞాపించతలుచుకుని వున్నారు; కాని వొక్క స్త్రీని కార్యదర్శిగా తీసుకోలేకపోయారు.

ఇంతే కాదు. ఇలాగ స్త్రీలు తమ అసమ్మతి చూపుతూ వుండగా జవాబు చెప్పడం కూడా మానేశారు.

మరిచిపోవద్దు. తమతో సమానంగా స్త్రీలను పోటింగుహక్కు యివ్వనందుకు ప్రభుత్వాన్ని నిందిస్తూవున్న పురుషులే చేసిన పనియిది.

కాంగ్రెస్సు ఆదర్శాలకూ, ఆదేశాలకూ యిక్కడ ప్రసక్తి లేదు. మరేమిటంటే?

కాంగ్రెస్సులో స్త్రీలకు బాధ్యతా, గౌరవమూ కలిగించే స్థానం లేదు.

కనకమ్మగారు మంచిపనే చేశారు. అయితే: తక్కిన స్త్రీలు కూడా తమలాగ బయటికి వచ్చేసేదాకానూ, లేక తమలో వొకరికి కార్యదర్శిపదవి దఖలుపరచబడేదాకానూ యీపట్టుదలా యీ దీక్షా విడవకుండా వుంటారా కనకమ్మగారు?

## దివంగతులు మునిస్వామినాయుడుగారు

దివాన్ బహద్దరు బొల్లిని మునిస్వామినాయుడుగారు దివంగతులైనా రన్న వార్త దేశంమీద పిడుగుపాటుగా పడింది.

నాయుడుగారికి మధ్యవయస్సులోనే మృతి రావడం ఆంధ్రదేశానికీ, ఆంధ్రదేశానికి కంటే జస్టిస్‌పక్షానికీ, జస్టిస్‌పక్షానికి కంటే కమ్మకులానికీ పెద్దదెబ్బ.

శాంతమూ, దూరదృష్టి కమ్మకులంలోనే అస అధికం. అవి నాయుడుగారిలో వెయ్యిరెట్లు ఎక్కువ.

యునివర్సిటీ తగవులు వచ్చినప్పుడు రాయలసీమ పక్షంలో నాయుడుగారు మహామేరువులాగ నిలవబడ్డారు. సర్కారులలో వారిని కాదన్నవారూ, వారికి నచ్చచెప్పగలవారూ వారు బతికి వుండగా కనపడలేదు. ఇకముందేనా ఏమో.

ఇక కొద్ది రోజుల్లో చనిపోతా రనగా విశాఖపట్నం సభల తీర్మానాలను పురస్కరించుకొని నాయుడుగారు చేసిన ప్రకటనను బట్టి అనేకులు, వారు ఆంధ్రోద్యమానికి విముఖు లని భావించారు; కాని అది పొరపాటు. నాయుడుగారు ఆంధ్రోద్యమానికి కాదు విముఖులు, సర్కారులవారి అవిమృశ్యకారిత్వానికి.

సర్కారులవారు యావదాంధ్రైక్యం సాధించడానికి పూనుకుని వుంటే రాయలసీమపక్షంలో వొక్క నాయుడుగారిని వొప్పించగలిగితే సరిపోయేది. ఇప్పు డది సుఖసుఖాల కొనసాగదు. ఏమయినా సర్కారులలో ఆమాత్రంవారు కూడా కనపడరు.

మద్రాసు రాజకీయాల్లో ప్రవేశించిన వెంటనే నాయుడుగారిలో వొక విశిష్టత అంకితం అయింది. చనిపోయేటప్పటికి కది వొక రోజు కంటే వొకరోజు బలపడింది; గాని సడలిపోలేదు. మరొకరయితే మంత్రిపదవితోటే అది వెంచేసివుండేది.

నాయుడుగారి స్థానం పూర్తిచెయ్యగలవారు కమ్మకులంలోనే కాదు ఆంధ్రజాతిలోనే యింతట్లో దొరకరు.

నాయుడుగారి కుటుంబానికి మా సానుభూతిని విన్నవించుకొంటున్నాం. నాయుడుగారికి ఆత్మశాంతిని కోరుతున్నాము.

## రాయలసీమ—కరువు

రాయలసీమలో కరువు పుట్టింది. అక్కడ మనుష్యులూ, పశువులూ—చివరికి పిట్టలూ మలమల మాడిపోతున్నాయి.

అక్కడ తుంగభద్ర—ఎన్నికల్లోకి వచ్చేదే ఒక నది వుంది; కాని దాన్ని వినియోగానికి తెచ్చినవారు లేకపోయారు. ఒక్క అంగుళమేనా నిలపగలిగేవారు లేక దర్జాగా అది సముద్రంలోకి షికారు కొడుతోంది.

అక్కడ వానలు వెనకపట్టాయి. చెరువులు ఎండిపోయాయి. ఇంకేముందీ? సస్యాలకు బదులు హాహాకారాలు మొలుచుకువచ్చాయి.

భూకంపంవల్ల బీహారు దెబ్బతిన్నప్పుడు మనవారు మన తాహతుకు మించిన సాయం చేశారు. మంచిదే. అయితే యిప్పుడు......?

ఎరగనేర్చుకుంటే సర్కారులవారికి యిది చాలా మంచిసమయం. నిజంగా, రాయలసీమవారు మనజాతివారే—మన రక్తంలో రక్తమే అనే జ్ఞానమే వుంటే బాధ్యత అంతా యిప్పుడు సర్కారులవారిమీద వుంది.

ఇప్పుడు సర్కారులలోనుంచి ఒక్క సందెడు గడ్డి పడితే అది అక్కడి ఒక గోమాతని ఒకపూట బతికిస్తుంది. ఒక్క పోలెడు బియ్యం పడితే ఒక మనిషికి ఒక పూట ఆయువు పోస్తాయి.

ఆంధ్రేతరుల సాయంకూడా పొందవలసిందే; కాని ముందు మన చెయ్యి దాటిన తరవాతే అది. ఇటీవల మనవారు హిందీప్రచారకులను పోషించడానికి వందలు వేలు విరాళాలిచ్చారు. ఏదీ రాయలసీమలోని క్షామపీడితులకలాంటి సాయం?

ఆంధ్రజాతి అంతా ఒకటి. ఒక యింటిలోనే నివసిస్తూ వున్న కుటుంబం. కుటుంబంలో కొందరు తిండిలేక మాడిపోతూ వున్నప్పుడు తక్కినవారు తమ్ము కానట్టు వూరుకోడం—పెద్ద పెద్ద మొత్తాలు అనవసర—అపాయకర—ఉద్యమాలకు ధారపొయ్యడం కూడనిపని.

ఈవిషయంలో యిప్పటికి జరిగిన ప్రకటన యేంతమాత్రమూ చాలదు. ఒక్కచమువుకొన్నవారిలోనే కాదు, పట్టణాల్లోనే కాదు పల్లెల్లో, పాలెములలో, గూడేలలో, గుడిసెలలో—అంతటా క్షామపీడితుల ఆర్తనాదాలు వినపడేటట్టు చెయ్యాలి. అప్పుడే దేశంలో చలనమూ, సానుభూతీ కలుగుతాయి. ఆవెంటనే సాయమున్నూ వస్తుంది.

## ఇంకా తెలవడం లేదూ?

నెల్లూరుజిల్లా కావలి గ్రామంలో జనవరి ౩ వ తేదీని జరిగిన హిందీ ప్రచారకసభలో ఉపన్యసిస్తూ ఒరుగండి వెంకటేశ్వరశాస్త్రిగారు హిందీవల్ల తెనుక్కి అపకారం జరగడం లేదన్నారు.

వారు పదిహేనుసంవత్సరాలనుంచి హిందీప్రచారం చేస్తున్నారుట. ఏవిద్యార్థికూడా హిందీవల్ల తెనుక్కి నష్టం జరుగుతోం దని వారికి చెప్పలేదుట. కనక హిందీవల్ల తెనుగు దెబ్బ తింటోం దనడం భ్రమ తప్ప మరేమీ కాదుట.

కాని కొంచెం దూరంవెళ్లాక వారే యిలా అన్నారు. "ఈవిషయమున హిందీప్రచారకులు గమనింపతగినది యొండు కలదు. ఉత్సాహము పెంపున కొందరు హిందీప్రచారకులు ఆంగ్లేయము బదులు హిందీ నభ్యసింపవలయు ననియు, మాతృభాషలను సముద్రమున పారవేయవలయు ననియు అనుచున్నారు. హిందీభాషనే సార్వదేశికముగ చేయ నుంకించుచున్నారు"

ఏం? హిందీవల్ల తెనుక్కి అపకారం జరుగుతోం దనడం యిక భ్రమ అంటే యేమన్నమాటా?

ఎవరో దాకా యెందుకూ? ఈ వెంకటేశ్వరశాస్త్రిగారే తెనుక్కి అందరికంటే యెక్కువ అపకారం చేస్తున్నారు. చూడండి. ఈకింది మాటలతో వారు తమ ఉపన్యాసం ముగించారు.

"పదమూడు వత్సరములకు తక్కువ వయస్సు గలవారికి ప్రాథమికపరీక్ష యందును, పదునెనిమిది వర్షములకు తక్కువవారిని రాష్ట్రభాషాపరీక్ష యందును ప్రవేశింపరానీయ జనదు. అప్పటికి గూడ వారికి తెనుగు రానిచో దానికి ఆంధ్రదేశీయులే బాధ్యులు"

మా ఆంధ్రసోదరులు ఈ ఆంధ్రేతరుల సవాళ్లు చిత్తగించారా? పద్ధెనిమిదేళ్ల వయస్సులోపున మనం తెనుగు చెప్పకపోతే మన వారిని వీరు మనకి తక్కనివ్వరు. హిందీలోకి లాక్కుపోతారు.

హిందీప్రచారకుల వుద్దేశం యిప్పుడు బోధపడిందా? దక్షిణదేశభాషలను చంపెయ్యడమే వారి సంకల్పం. వారు తెచ్చించే ప్రతీ దమ్మిడీ అందుకే ఉద్దేశించబడుతోంది. వారుచ్చరించే ప్రతీ వాక్యమూ దానికే బలం కలిగిస్తున్నది.

మరచిపోకండి. హిందీప్రచారకులు దేశీయులకు ముఖపిధానం చెయ్యడంకోసం హిందీ రాష్ట్రభాష మాత్రమే అంటున్నారు. ప్రాంతీయభాషలుకూడా వుండా లంటున్నారు. ఇదే నిజ మయితే తెనుగేరాని తెనుగువాడికి రాష్ట్రభాష యెందుకూ?

ఇంగ్లీషువారు ఈ దేశంలో తమ భాషకే ప్రాధాన్యం కలిగించారు. పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ, కచ్చేరీలలోనూ దానికే పట్టాభిషేకం చేశారు. అది చదివినవారికే నౌకరీ లన్నారు. అన్నింటికీ వారు ఇలాగ ఇంగ్లీషునే ప్రయోగిస్తూ వుండినా ప్రతీ మొగవాణ్ణీ, ప్రతీ స్త్రీనీ ఇంగ్లీషులోకి లాక్కుపోతా మనలేదు.

ఇక్కడ గమనించతగ్గ విచిత్రం యేమిటంటే? విజ్ఞానమంతా ఇంగ్లీషులోనే బోధించడమూ, రాజకార్యా లన్నీ యింగ్లీషులోనే జరిగించడమూ— ఇది కొంపలు గుల్లలు చేసే దనీ, ప్రతిభను నొక్కిపోగొట్టే దనీ, ప్రజలను దుబాసీలదగ్గిరికి తరిమే దనీ, అస్వాభావికమనీ మన మందరమూ ఆక్షేపిస్తున్నాము. ఖండిస్తున్నాము; కాని దేశభాషలు వచ్చినా సరే రాకపోయినా సరే మేము ప్రతీ స్త్రీనీ, పురుషుణ్ణీ హిందీలోకి లాక్కుపోతా మనే హిందీప్రచారకసభలనూ

హిందీ ప్రచారకులనూ మనవారు పోషిస్తున్నారు. ప్రశంసిస్తున్నారు. ప్రోత్సహిస్తున్నారు.

అక్కడక్కడ కొందరుకొందరు "హిందీ ప్రచారకుల జోలి మీకెందుకూ? తెనుగుభాషని మీరు ప్రచారం చెయ్యరాదా? ఎవరిపని వారు చేసుకుపోతే తగువు లుండవుకదా" అని తునితగవు చేస్తున్నారు. చటుక్కున చూస్తే యిది సహేతుకంగానే కనపడుతుంది; కాని యిందులో ఆలోచన యేమీ లేదు.

ఒకరు కాళ్లకింద నిప్పు పెడుతూ వుంటేగా ఇంకొకరు నెత్తిమీద నీళ్లు చల్లితే ప్రయోజనం వుంటుందా? సహజంగానే మనవారికి మాతృభాషాభిమానం తక్కువ. చదువుకొన్న వారిని యింగ్లీషు ఆక్రమించినది. చదువుకోనివారిని హిందీ చుట్టబెడితే యిక తెనుగుజీవనానికి తెరేదీ?

అఖిలభారతజాతీయత అంటే యేమిటి? రాష్ట్రీయత ధ్వంసమైనంతవరకూ అది సిద్ధిస్తుందా?

మోసపోవద్దు. హిందీప్రచారం పయోముఖవిషకుంభం. మేకవన్నె పులి. అది మనకి సర్వనాశం కలిగిస్తుంది.

అయితే వొకటి చెప్పవలసివుంది. హిందీభాషే హిందూదేశానికి సామాన్యభాషగా వుండతగ్గది; కాని దానికి సమయం కాస్తుంది. ఇప్పుడు దాని ప్రమేయం లేదు అది లేకుండానే మనం మహాఫలాలు సాధించగలం. అని సాంధచాకే హిందీకి వినియోగం.

ఇప్పుడు దక్షిణదేశంలో జరిగే హిందీప్రచారం భారతజాతీయతావికాసానికి కాదు. హిందూస్థానీల సంఖ్య పెరగడానికి.

## నాట్యకళ

నాటకం రాయడం వొక కళ. నాటకం ఆడడమున్నూ వొక కళ. నాటకం చూడడం కూడా వొక కళ.

ఇలాగ సర్వాంగీణంగా కళ అయిన యీ వస్తువు అన్నీ సరిగా అమరితే చక్కగా కళకట్టి హృదయంమీద వొక మాయనిముద్ర వేస్తుంది.

నిజమే; కాని మన దురదృష్టంవల్ల మన పూర్వులు మన మాతృభాషలో నాటకాలు రాయలేదు. భవభూతి పక్కా తెనుగుకవి అయివుండికూడా తెనుగును ముట్టుకోలేదు.

ఇంకొక చిత్రం. మొత్తానికి మన పూర్వకవు లందరూ భాషాంతరీకరణాలతోనే కాలం గడిపారు. వారు పురాణాలు తెనిగించారు. కావ్యాలు తెనిగించారు. చివరికి ధర్మశాస్త్రాలు కూడా తెనిగించారు; కాని వొక్క నాటక మయినా తెనిగించలేక పోయారు.

మనుచరిత్రలాంటి కొత్తరకం గ్రంథాల రచన ప్రారంభం అయినప్పుడేనా మనవారికి నాటకాభిరుచి కలక్కపోయింది.

చివరికి యక్షగానాలు తప్ప మన భాషలో మహానాటకాలు లేకపోయాయి.

ఇక ఇప్పుడు. సంస్కృతమూ, ఇంగ్లీషూ మొదలయిన భాషల్లోనుంచి నాటకాలు తెనుగులోకి అవతరించాయి. స్వతంత్రాలున్నూ పుట్టుకవచ్చాయి. నాటక ప్రదర్శనాలుకూడా వెలిశాయి. అయితే రచనలోనూ శిక్ష లేదు. ప్రదర్శనంలోనూ శిక్ష లేదు. చూడడంలో సైతం శిక్ష లేదు.

ఎవరికి తోచిందివారు, ఎవరికి నచ్చినట్టు వారు రాశకే, ఆటకే మొదలుపెట్టారు. చూసేవారుకూడా యీస్వతంత్రాన్నే అవలంబించారు.

రకం తయారయింది; కాని రసం............

ఇదంతా చూసి ఆంధ్రనాటకకళాపరిషత్తువారు 'నాట్యకళ' అని వొక పత్రిక ప్రారంభించారు. దీని వుద్దేశం కవులకూ, నటులకూ ద్రష్టలకూ మంచి మార్గాలు చూపించి కళకి సాఫల్యం కలిగించడంగా కనపడుతోంది. ఇది మూడుమాసాలకోమాటు ప్రకటించబడుతుంది. సంవత్సరచందా ౨-౦-౦ విడిసంచిక ౦-౮-౦.

మొదటి సంచిక యిప్పుడిప్పుడే మా కార్యస్థానం అలంకరించింది.

పుష్టి గల విగ్రహం. ముద్దులు మూటగట్టే రూపం. శోభాజనకా అయిన మాటలు.

రచయితల్లో ప్రముఖుల సంఖ్య హెచ్చుగానే వుంది.

నాట్యకళకి మేము స్వాగతం యిస్తున్నాము.

---

# ఒక జాబు

ప్రబుద్ధాంధ్ర సంపాదకులకు:—

అయ్యా! నమస్కారములు

ఆంధ్రలోకమునకు మీ పత్రిక చేయుచున్న సేవ అమూల్యము. నేను ఆంధ్రుడను. మీ పత్రికయందు నాకు అభిమానము. ఆయభిమానమే నన్నీ జాబు వ్రాయుటకు పురికొల్పినది.

గడచిన సంవత్సరమున ఎన్నో తెలుగు పత్రికలు ఉత్పన్నమైనవి. ఈ సంవత్సరమున మరికొన్ని క్రొత్తవి బయలుదేరు సూచనలు కనుపించుచున్నవి. బయలుదేరవలసినదే. ఎన్ని బయలుదేరినను చాలవు. బంగాళీభాషలో ఎన్ని మాసపత్రికలో ఉన్నవి. వాటి సంఖ్యముందు మనవాటిసంఖ్య బహుస్వల్పము. అమెరికా వంటి దేశములయందలి

పత్రికల సంఖ్యతో పోల్చినచో ఇంక చెప్పవలసిన పనియేలేదు.

పత్రికలు పుట్టుటలో గొప్పలేదు. పుబ్బలోపుట్టి మఘలో మాడిపోయిన పత్రికలు తెలుగు దేశములో అనేకములున్నవి. పత్రికలు దినదిన ప్రవర్ధమానములు కావలెను. అవి ఎందుకొరకు వ్రాయబడుచున్నవో, ఎవరికొరకు వ్రాయబడుచున్నవో పత్రికాధిపతులు మరువకూడదు. మరచినవాడు వృద్ధియుండక పోవుటలో ఆశ్చర్యములేదు.

ప్రబుద్ధాంధ్ర ఉన్నతశ్రేణికి చెందిన పత్రిక. కేవలము వినోదార్థము పుట్టినదిగాదిది. ఆంధ్రజీవితములో మార్పులు దిద్దవలెనని మీసంకల్పము. ఆంధ్ర వ్యక్తిత్వమును బలపరచవలెనని మీ కోరిక. మీరు కేవలము వాఙ్మయసేవతో తృప్తిపడువారు కారు. గడచిన సంవత్సరపు పన్నెండు సంచికలును ఈక్రొత్త సంవత్సరపు మొదటి సంచికయును చదివిన మీదట నాకు గలిగిన అభిప్రాయ మిది. సరికావచ్చును. కాకపోవచ్చును. సరియే అయినయెడల దిగువ విషయమును దయతో గమనింతురని ఆశించుచున్నాను.

కాలక్రమమున అనేక ఆంగ్లేయపదములు తెలుగు పదములవలె ధారాళముగా తెలుగు పత్రికలలో వాడబడుచున్నవి. అవి తెలుగు అక్షరములలో వ్రాయబడినపుడు కొంతవరకు అర్థముగునునే యున్నవి. కాని కొన్ని తెలుగు పత్రికలలో ఇంగ్లీషు మాటలను ఇంగ్లీషు అక్షరములలోనే తరచుగా వ్రాయుచున్నారు. తెలుగు దేశములో ఇంగ్లీషు అక్షరములను గుర్తించనైనను లేనివారు అనేకులున్నారు. ఈవిషయమును కొందరు వ్యాసకర్తలు ఎరుగరో, వ్రాయునపుడు జ్ఞప్తియందుంచుకొనరో, తెలుగు అక్షరములతో ఇంగ్లీషు మాటలను వ్రాసినచో తప్పుగా ఉచ్చరింపబడునను భయమో, మొత్తము మీద ఇంగ్లీషుమాటలు తెలుగు పత్రికలలో అచ్చుపడుచున్నవి. అనేక మంది ఆంధ్రుల కవి అర్థముగుట లేదు. ప్రబుద్ధాంధ్ర జనవరి సంచిక యందలి "ఒక సంభాషణశకలము" అను వ్యాసమే దీనిని విశదీకరింప గలదు.

ఇంగ్లీషు కవులను గురించి వ్రాయ వలదనుట లేదు. ఇంగ్లీషు పదములను పూర్తిగా మాని అసంతృప్తికరమైన అనువాదపు ముక్కలనే వాడమనుట లేదు. ఇంగ్లీషు పదములను అత్యవసరమైనచోట విధిలేక వాడినంత మాత్రముననే తెలుగు భాషకు తీరని నష్టము వాటిల్లునని చెప్పుట లేదు. కాని ప్రబుద్ధాంధ్ర పత్రికవంటి ఉత్తమపత్రికలను చదువ నోచుకొనిన, ఇంగ్లీషు నెరుగని, ఆంధ్ర సోదర సోదరీమణులకు, అనవసరముగ మధ్య మధ్యను మరియొకరి వద్దకు పరుగెత్తుకొని పోయి, "ఈమాట, ఇదేదో ఇంగ్లీషులోనున్నది నాకు తెలియుటం లేదు కొంచెము చదివి చెప్పండి" అని బతిమాలు కొనవలసిన గతి పట్టకుండునట్లు వ్యాసకర్తలు తమ వ్యాసములను వ్రాయుదురు గాక. అట్టి వ్యాసములనే తాము ప్రకటింతురు గాక. ఈ విషయమున ఇతర తెలుగు పత్రికలకు కూడ మార్గదర్శకు లగుదురుగాక. ఇదియే నా ప్రార్థన.

ఇట్లు

ప. కేశవరావు

కొవ్వూరు ౧౬—౧—౩౫

(మా మిత్రులు కేశవరావుగారు చేసిన యీ సూచన—ఉపదేశం వ్యాసకర్తలందరూ—ముఖ్యంగా ఇంగ్లీషు చదివినవారు శిరసావహించతగివుంది. అన్ని భాషలలోలాగే తెనుగుభాషలోకూడా ఇతరభాషల శబ్దాలు చాలా చేరివున్నాయి. వాటిలో చాలా మాటలను మనం సర్వత్రా వాడుకోక తప్పదు, వాడుకుంటూనూ వున్నాము. కాని తెనుగురచలలో ఇంగ్లీషు లిపిని ఎందుకు వాడాలి? ఉరుదూ మాటలకు మనం పార్శీలిపిని వాడుతున్నామా?......—ఈలేఖలో కేశవరావుగారు నిర్దేశించిన ఒక సంభాషణశకలాన్ని గురించి చిన్న వివరణం అవసరం. మొదట అది మాకు చేరినపుడు తద్రచయిత అగు శ్రీనివాసరావుగారిని "ఇంగ్లీషు అక్షరాలను తొలగించిపంపవలసిం"దని కోరాము. లేకపోతే, "సెలవిస్తే మేము తెనుగులో రాస్తా" మనిన్నీ ప్రార్థించాము. కాని వారు జవాబు రాయలేదు. తరవాత మద్రాసులో కనపడి "ముందు చూచుకుందాం లెండి" అన్నారు. శ్రీనివాసరావుగారి కేనా యీ విషయంలో పట్టుదల వుందని మేము చెప్పలేము. ఏమయినా యిది సవరించుకోవలసిన విషయం. కేశవరావుగారిలాగే అనేకులు మాకీ సంగతిసూచించారు. కొందరు చాలా చురుగ్గానే చెప్పారు కూడానూ......ఈ సందర్భంలో మా బాధ్యతను గుర్తించ లేనందుకు క్షమాపణ చెప్పుకుంటున్నాము. మామిత్రులు శ్రీనివాసరావుగారున్నూ, ఇలాగ తెనుగురచనలలో ఇంగ్లీషు అక్షరాలను చొప్పించుతూవున్న యువకులును పట్టభద్రులైన కేశవరావుగారు చేసిన సూచన ననుసరిస్తారని నమ్ముతున్నాము.

సంపాదకుడు)

---

# ఒరిస్సా సరిహద్దులు—జయపురం ఏజన్సీ

## శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు. బి. ఏ

చెయ్యి కాలిన తరువాత ఆకులు పట్టుకొనుటవలన లాభము లేకపోయినను, చెయ్యిచురికి నప్పుడైన ఆకులు పట్టుకొనుటవలన లాభం ఉండకపోదు. అలాగున ఉంది జయపురం ఏజన్సీలో చాలకాలంనుండి నివసించుచున్న తెలుగువారి సంగతి. నాగరికతయందును వర్తక వ్యాపార సౌకర్యములయందును, విద్యాభివృద్ధియందును చాల వెనుకబడియున్న యీమన్య ప్రాంతనివాసులకు ఇంతవఱకును చెన్న

రాష్ట్రములో అనేకవిధములైన లాభములు కలుగుచున్నవి. ఈప్రాంతములనుండి ప్రభుత్వమువారికి వచ్చే ఆదాయముకన్న యీ కొండజాతులవారి నాగరికతాభివృద్ధికొఱకును బాటలు వేయుటకును సాధ్యమైనన్ని పాఠశాలలు పెట్టుటకును ప్రభుత్వమువారు ఖర్చు పెడుతున్న సొమ్ము ఎక్కువ. అందుచేత హాయిగా చెన్నరాజధానిలో ఉండగా మన కేమి భయము? మనము కూడ క్రమక్రమముగ, తోడి ఆంధ్రులతో సమానము కావచ్చును. అని యీ ప్రదేశముల తెలుగువారు నిర్భయముగా నున్న సమయములో హఠాత్తుగా సంభవించిన దీ దురన్యాయం.

అయితే యీ దురన్యాయమునకు కారణం యిక్కడి తెలుగువారే అన్నారు ఒరిస్సా బౌండరీకమిటీవారు. తమకు తామే యిట్టి పాటు తెచ్చుకున్నారు తెలుగువారు ఆకమిటీవారి అభిప్రాయం ప్రకారం. తెలుగువారిలో ఒక్కరను కూడ యీ సమ్మేళనమునను వ్యతిరేకముగా ఉన్నట్లు తెలియజేసినారు కారట. అదీ కాక తెలుగువారిలో యింకో లోప మున్నదన్నారు కమిటీవారు. వీరికి ఉద్దేశింపబడిన ఒరిస్సాసమ్మేళనము వలని కష్టనష్టములు గుర్తించే జ్ఞానమే లేదట. ఒకవేళ ఆ విషయం తెలిసినవా రున్నను అట్టివారు చాలతక్కువగా నున్నారట. ఇలాగని చెప్పి తెలుగువారి కిట్టి అన్యాయం చేయుట న్యాయమా?

జెనుకటి మహారాజులంగా ప్రసిద్ధులైన ఈ సమ్మేళనోద్దేశమునకే సమ్మతించినవారు కారు. గత ౩౦ సంవత్సరములలోను నాలుగైదు సారులు ఈ సమస్య చర్చకు వచ్చినప్పుడు మద్రాసు గవర్నమెంటువారు ప్రాంతములనుండి ఏభాగమైనను విడదీయకూడ దని దృఢముగా చెప్పినారు. ఈ మన్యప్రాంతముల జనాభాలెక్కలను పట్టి చూచినయెడల ఉత్కళులు అధికసంఖ్యాకులు కారనియు, ఉత్కళులు కానివారు తెలుగువారో తెలుగువారితో దగ్గర సంబంధము కల కొండజాతులవారో అగుచున్నా రనియు మద్రాసు గవర్నమెంటువారు చెప్పియున్నారు. సైమను కమిషనువారిచే నియోగింపబడిన ఎట్లీకమిటీవారు కూడ యీ ప్రదేశములనుండి ఏభాగము నైనను ఒరిస్సాలో కలుపుట కంగీకరింపలేదు.

న్యాయవిచారణ ఫలితముగా పరిస్థితులు తెలుగువారి కింత అనుకూలముగా ఉన్నప్పుడు ఈ విషయమై వీరికి భయమేల? ఆందోళన పడుటకు బొత్తిగా అవసరము లేదే? "మన అభివృద్ధికి భంగకరముగను, చాలకాలమునుండి యిచ్చట నివసించుచు భూసంబంధమైన ఆస్తులను పుష్కలముగా కలిగియున్న మనకు నష్టకరముగను, ఇంత హఠాత్తుగ యింత అహేతుకముగ, యిట్టి తీర్మానము తటస్థించు" నని తెలుగువారు కలలోనైనను అనుకొనుట కవకాశ మున్నదా? అందుచేతనే యీ విషయమై తెలుగువా రట్టి ఆందోళనము చేయలేదు. ఇది కారణముగా పెట్టుకొని తెలుగువారికి కూడ యీసమ్మేళన మిష్టమే కాబోలు నని ఊహించి యీ భాగములను అర్థికదౌర్బల్యముచే పీడింపబడనున్న ఒరిస్సారాష్ట్రములో చేర్చి ఆంధ్రుల జాతీయతకు, భాషకు, ఔన్నత్యమునకు, అన్నివిధముల నష్టము కలిగించుట న్యాయసమ్మతం కాదు.

సమ్మేళనమువలన కలుగబోయే కష్టనష్టములు యిచ్చటి తెలుగువారికి బాగుగా తెలియలేదను మాట వాస్తవము. ఈసంగతి ఒరిస్సాకమిటీవారు సరిగా గ్రహించినారు. వీరికే యీవిషయము బాగా నాటియున్నయెడల వెంటనే తగిన ధనము జతపెట్టి తమ వాదమును గవర్నమెంటువారికి నచ్చచెప్పుటకు ఎవరినైనను లండను పంపించక ఊరకుందురా? గంజాం విశాఖపట్నం జిల్లాలలోని ఆంధ్రసోదరులకు—వారితో సహా ఆంధ్రజాతికి—రానున్న తీరని నష్టమును ప్రతిఘటించు సముద్దేశముతో తక్కిన ఆంధ్రమండలముల వారు కూడ చేతనైన సహాయము చేయుచుండగా యిచ్చటి తెలుగువారు మాట్లాడకుండ ఊరకొనుట ఎంతమాత్రము సమంజసముగా లేదు. అయితే వీరి అవివేకమునకు ఇట్టి దురన్యాయమా శిక్ష! ఈసమ్మేళనమువలని లాభనష్టములు వీరికి తెలియకపోయినను అకష్టనష్టము లనుభవించక తీరదుకదా! కాబట్టి యిట్టి అజ్ఞానుల నుద్ధరించుట సహృదయుల విధి.

ఇంతకును ఈ ప్రదేశములు తెలుగుప్రాబల్యం కలవా ఉత్కళప్రాబల్యం కలవా అని విచారించినచో ఈరెండును కావు. ఇచ్చటి పురాతననివాసులు సవరలు కొండజాతులు మొదలైనవారు. వీరు అభివృద్ధి పొందవలెనన్న భాగ్యవంతమైన చెన్నరాష్ట్రములో నుండవలెను గాని డబ్బులేక పరిపాలనాసంబంధములయిన పనులకొరకే కేంద్రప్రభుత్వమునుండి సాలుకు ముప్పదిలక్షలరూపాయల ధనసహాయ మపేక్షించునట్టి ఒరిస్సాలో నున్నయెడల ఏమిలాభము? ఒరిస్సాకమిటీవారికి పంపించిన మెమోరాండములో సి. ఎ. హెండర్సనుదొరగారు చెప్పినట్లు ఈకొండజాతులవారికి ఉత్కళులతో నెట్టి సంబంధమును లేదు. వీరు మాట్లాడే కంధ్రిఒరియా ఒరిస్సాలో బోధపడుట చాలా కష్టము. గంజాంజిల్లా ఒరియాతో పోల్చి చూచినను చాలా భేదము కన్పడును. ఈపరిస్థితుల నాలోచించి ఆంధ్రాభిమాని యగు శ్రీవిక్రమదేవవర్మమహారాజారు కూడ ఆంధ్రోద్యమము పట్ల సాదరత చూపి తోడ్పడుదురుగాక. ఈసమ్మేళనమందలి అన్యాయమును అధికారవర్గము గుర్తించి తెలుగువారికి న్యాయ మిచ్చుదురుగాక.

---

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి ⁂ రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0-4-0 చందాదారులు ఒకేసారి రు 7-8-0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్ రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | |
|---|---|---|
| 11 | ప్రేమసుందరి | 1 8 0 |
| 12 | చోరశిఖామణి | 1 8 0 |
| 13 | లక్ష్మీప్రసాదము | 1 8 0 |
| 14 | హత్యారహస్యము | 1 8 0 |
| 15 | ఫాస్టు (1 భాగము) | 1 8 0 |
| 16 | ఫాస్టు (2 భాగము) | 1 8 0 |
| 17 | కుముద్వతి | 1 8 0 |
| 18 | చిన్నకోడలు | 1 8 0 |
| 19 | రహస్యభేదనము | 1 8 0 |
| 20 | సింహగడము | 1 8 0 |
| 21 | మణిహారము | 1 8 0 |
| 22 | మొగలాయీదర్బారు 1 భాగము | 1 8 0 |
| 23 | ఘటనాచక్రము | 1 8 0 |
| 24 | రాజసుందరి | 1 8 0 |
| 25 | కుంకుమభరణి | 1 8 0 |
| 26 | జాగిలము | 1 8 0 |
| 27 | మొగలాయీదర్బారు 2 వ భాగము | 1 8 0 |
| 28 | సరస్వతి | 1 8 0 |
| 29 | ఆనందాభాయి | 1 8 0 |
| 30 | హత్యాన్వేషణము | 1 8 0 |
| 31 | మొగలాయీదర్బారు 3 వ భాగము | 1 8 0 |
| 32 | గంగ | 1 8 0 |
| 33 | మొగలాయీదర్బారు 4 వ భాగము | 1 8 0 |
| 34 | కోహినూరు | 1 8 0 |
| 35 | ఆటీన్ మణేలా | 1 8 0 |
| 36 | అపరిచిత | 1 8 0 |
| 37 | అంతఃపురము 1 భా॥ | 1 8 0 |
| 38 | అంతఃపురము 2 భా॥ | 1 8 0 |
| 39 | అగ్రహారము | 1 8 0 |
| 40 | ఛిన్నహస్తము 1 భా॥ | 1 8 0 |
| 41 | ఛిన్నహస్తము 2 భా॥ | 1 8 0 |
| 42 | కంకణరహస్యము | 1 8 0 |
| 43 | సంజీవి 1 భా॥ | 1 8 0 |
| 44 | సంజీవి 2 భా॥ | 1 8 0 |
| 45 | వజ్రరాణి | 1 8 0 |
| 46 | హత్యాభ్రమ | 1 8 0 |
| 47 | కాశీఖండము | 1 8 0 |
| 48 | సేవాశ్రమము 1 భా॥ | 1 8 0 |
| 49 | సేవాశ్రమము 2 భా॥ | 1 8 0 |
| 50 | దాసీకన్య | 1 8 0 |

## అనుబంధములు

| | | |
|---|---|---|
| 1 | మృత్యురంగిణి | 0 12 0 |
| 2 | అభాగిని | 0 12 0 |
| 3 | ఛద్మవేషి | 0 12 0 |
| 4 | విదురుని యుపదేశములు | 1 0 0 |
| 5 | కాంచనమాల | 1 0 0 |
| 6 | సీమంతిని | 1 0 0 |
| 7 | సుశీల | 1 0 0 |
| 8 | శశిరేఖ | 1 0 0 |
| 9 | యమునాబాయి | 1 0 0 |
| 10 | శ్యామల | 1 0 0 |
| 11 | కాంతంకథలు (చిన్నకథలు) | 1 0 0 |
| 12 | కాలసర్పి | 1 0 0 |
| 13 | భారతకథాసారం | 1 0 0 |
| 14 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 |
| 15 | అరక్షణీయ | 1 0 0 |
| 16 | మాధవి | 1 0 0 |
| 17 | లలిత | 1 0 0 |
| 18 | పెండ్లి దండ | 1 0 0 |
| 19 | కథావళి | 1 0 0 |
| 20 | నాలుగుకథలు | 1 0 0 |
| 21 | నీతిప్రబోధిక | 1 0 0 |
| 22 | ఆదర్శము 1 భా॥ | 0 12 0 |
| 23 | ఉదంకుడు | 0 12 0 |
| 24 | భేతాళకథలు | 0 12 0 |

## నాటకములు

| | | |
|---|---|---|
| 1 | మార్కండేయ | 0 12 0 |
| 2 | అహల్యాశాప విమోచనము | 0 12 0 |
| 3 | మేవారుపతనము | 1 0 0 |
| 4 | వరమాల | 1 0 0 |
| 5 | షాజహాను | 1 0 0 |
| 6 | నూర్జహాను | 1 0 0 |
| 7 | దుర్గాదాసు | 1 0 0 |
| 8 | చంద్రగుప్త | 1 0 0 |
| 9 | దంపతులు | 1 0 0 |
| 10 | విజయవిజయం | 1 0 0 |
| 11 | భక్తకుచేల | 1 0 0 |

 ఈగ్రంథములు రాజమండ్రీలో కళాభివర్ధనీ పరిషత్తులలోను దొరకును.

కటుకరోహిణీ:—కటుకా—Picrorrhiza kurroa Veronicalindleyana.

**పరిచయపదములు** శతపర్వా - చాలా గణుపులు గలది. కాండరుహా-కాడయే మొలచునది. చక్రాంగీ - ముక్కగొట్టిన చక్రాకారముగ నుండునది. గుణబోధినీపదములు : ఆమఘ్ని - ఆమదోషమును బోగొట్టునది.

**స్వరూపము** ఇది గుల్మజాతిలోని మొక్క. ఆకులు కొంచెము పొడవుగను, కంగోరా గలిగి కుక్కపొగాకు ఆకులువలె నుండును. దీని పూవులు నీలిరంగు గలిగి గుత్తులుగా నుండును. దీనిలో రెండు జాతులు కలవు. నీలిరంగుగల దొకటియు, పచ్చరంగుగల దొకటియు. హిమాలయప్రాంతప్రదేశములలో నిది విస్తారముగా నుండును. దీని వ్రేళ్లనే యౌషధములకు వాడుదురు.

**గుణములు** ఇది చేదురుచి గలిగి యుండును. వేడిచేయు స్వభావము గలది. విపాకమున కారపు రుచిగ మారును. రూక్షలఘుగుణములు కలది. బాగుగా విరేచనమును జేయును. అగ్నిదీప్తిని గలిగించును. హృదయమునకు హితకరమైనది. కఫపిత్తజ్వరములను హరించును. ప్రమేహములు శ్వాసకాసలు, రక్తతాపము, కుష్ఠరోగము, క్రిములు హరించును. విషమజ్వరములను పోగొట్టును.

**ప్రయోగములు** హృద్రోగమునకు:—కటుకరోహిణి, యష్టిమధుకమును మెత్తగా నూరి పంచదారనీళ్లతో కలిపి త్రాగిన హృద్రోగములు శమించును.

స్తన్యశుద్ధికి:—దీని వేళ్లు పాలతో గాని నీళ్లతో గాని నూరి త్రాగిన స్తన్యము శుద్ధమగును.

కఫపిత్తజ్వరములకు:—కటుకరోహిణి ఉసిరికాయంత ముద్ద వేడినీళ్లలో కలిపి కొంచెము పంచదార వేసి త్రాగిన క్రిములను బోగొట్టి విరేచనమును జేసి జ్వరములను తగ్గించును.

ఎక్కిళ్లకు:—గైరికమును, కటుకరోహిణియు సమానములుగ చూర్ణించి తేనెతో కలిపి యిచ్చిన ఎక్కిళ్లు శమించును. (సుశ్రుతము)

కటుకరోహిణి కషాయములో సదాపాకు చూర్ణము కలిపి మూడు రోజులు తెల్లవారుజామున నే త్రాగిన ఋతురక్తము జారీయగును. కటుకరోహిణి గుంటకలగరాకు రసముతో నొక వారము దినములు మర్దించి కందిగింజలంత మాత్రలు చేసి అల్లపురసముతో నిచ్చిన చలిజ్వరములు కట్టును. చిట్టినాగమట్ట రసముతో కటుకరోహిణిని మెత్తగా నూరి గుండెలకు పట్టువేసిన గుండెలలో పీకునొప్పి తగ్గుటయే గాక, శ్లేష్మము కరగి ఆయాసము తగ్గును. లోనికిచ్చు మోతాదు ఎక్కువైనచో వికారమును గలిగించును. కటుకరోహిణిలో రెండవరకము తెల్లది నల్లదానికంటె తీక్ష్ణమైన గుణములను గలిగి మిక్కిలి విరేచనమును జేయు స్వభావము గలిగి యుండును. వాడుకలో నల్లదానికంటె తెల్లది తక్కువ మోతాదుగనె వాడవలయును. లేక వికారము వాంతియును గలిగించును దీనిని పైన పట్టువేసినచో పొక్కును. దీనికి బాదమునూనె గాని వప్పుగాని విరుగుడువస్తువ.

**నవీన వైద్యక మతము** ఇది రసాయనము. చేదురుచి, పాచనకారి, పైత్యహరము. అజీర్ణము, గ్రహణి, శ్వాస, పిత్తవికృతులు, కామల మొదలగు రోగములయందు దీనిని బాగుగా వాడవచ్చును. యకృద్వృద్ధిలో నిది చేదుపుచ్చతో సమానముగా పని చేయును. చేదుపుచ్చకంటె ఇది మృదువుగా పని చేయును. విషమజ్వరముల కిది యుత్తమమైన యౌషధి. పిల్లల క్రిమిరోగములయందు కటుకరోహిణి బాగుగా పనిచేయును. (మెటీరియా మెడికా ఆఫ్ ఇండియా. R. N. Khory part II, P. 457.)

# వసంతకుసుమాకరము

మధుమేహము, అతిమూత్రము, రాచపురుపులు, శుక్రక్షయము, శుక్రనష్టము, బలహీనత, చిరకాలపు తెల్లకుసుము, సుఖవ్యాధులు శీర్ణించుటచే కలుగు సకలమూత్రవాళవ్యాధులకు ప్రసిద్ధకెక్కిన రాజౌషధము. తులము 1 కి రు 20—0—0.

# సిద్ధమకరధ్వజము

ఇందు బంగారు కలదు. పూచీ యిచ్చెదము.

జగత్ప్రసిద్ధమగు బలవర్ధకౌషధము. రక్తక్షీణము, వీర్యదోషము, నపుంసకత్వము, క్షయ, శ్వాసకాసలు, నరముల బలహీనత, కుసుమ రోగములు, మొదలగువానికి దివ్యౌషధము.

తులము 1 కి 24—0—0.          60 మాత్రలు రు 10—0—0

## ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మీ విలాసరసము

# చ్యవనప్రాశము

క్షయరోగులకు అమృతోపమానములగు దివ్యౌషధములు

చిరకాలము క్షయవ్యాధిచే పీడింపబడుచు శల్యావశిష్టముగ నుండువారలకు నూతనయౌవనమును ఆరోగ్యమును కలిగించును. క్షయ శ్వాసకాసలు ఉబ్బసము కఫముతో కలసి రక్తముపడుట, రక్తహీనత, శరీరకృశత్వము, హృదయదౌర్బల్యము దీర్ఘకాలము నుండి బాధించు మొండిదగ్గులు మొదలగునవి జయించును. బలము, కాంతి శుక్రమును వృద్ధిచేయును.

రెండు ఔషధములు కలిపి సేవించవలెను.

నెలకు రు 13—12—0.

చిరునామా:—వేంకటేశ్వర ఆయుర్వేదనిలయము

హెడ్డాఫీసు:—చింతలూరు, ఆలమూరుపోస్టు, తూర్పుగోదావరిజిల్లా

---

బ్రాంచీలు:— 1. కాకినాడ, 2 రాజమండ్రి, 3. పెద్దాపురం, 4. అనకాపల్లి, 5. విశాఖపట్టణం, 6. ఏలూరు, 7. అమలాపురం 8 తుని. 9. రామచంద్రపురం.

## 228. ఔషధములు గలవు. కేటలాగు ఉచితము.

ఫిబ్రవరి నెలాఖరులోపున ఉత్తరము వ్రాసిన కేలండరు పంపెదము.

# లక్ష్మీకవచము

వలయుకోరిక లొసంగుటలో అమోఘము!          వలసినకార్యసాఫల్య మొనగూర్చుటలో అద్భుతము!!

పరీక్షయందుత్తీర్ణులు కాదలంచిన విద్యార్థులకు ప్రత్యక్ష సరస్వతి. ఉద్యోగము లేక నల్లాడువారికి బనిగల్పించుటయందును. కోర్టు వ్యాజ్యములలో దగుల్కొని బాధపడువారిని గెల్పొందించుటయందును. దారిద్ర్యసాగరమునబ్రుంగి దరిగానక దుఃఖించువారిని లక్ష్మీప్రసన్నులుగా జేయుటయందును, గొప్పకల్పవృక్షము. సంతానములేక చింతించు దంపతులకు సంతానమొసంగి సంతోషవార్ధి నోలలాడించు చింతామణి. వేయేల? ఏ కోరికతో నీకవచమును ధరింతురో ఆ కోరిక సమకూర్చుటకు నిలవేల్పు. ఈ కవచము దైవోపాసకులచే బీజాక్షర సంయుతమై లక్ష్మీప్రతిమ నలరారునట్లుగా గల్పింపబడినది. దీనిని ధరించి, వలసిన సాఫల్యములు పొందినవార లొసగిన యోగ్యతా పత్రములను దీనిని ధరించవలసి వచ్చినప్పుడు మీరు చేయవలసిన పూజావిధానము లక్ష్మీ స్తోత్రముగల పాత్రము మీ ఆర్డరు కవచముతో బంపబడును.

నోటు:—లక్ష్మీ ప్రతిమతోగూడి బీజాక్షర సంయుతమైన యీ కవచము పంచలోహ నిర్మితమై మైలగాలిసోకిన బలము చెడకుండా యుండునటుల తావీజుగాచుట్టి ధరించుటకు వీలుగానుండుటకు కొండీలతోను చక్కని పట్టుత్రాడుతోను నమర్పబడియున్నది. వెల రు ౧—౪—౦ మాత్రమే. డిటో వెండిది రు ౧—౧౨—౦

లక్ష్మీకవచనిలయం,
రాజమండ్రి.

---

# సిందూరభూషణము

గర్భవతుల కుపయోగము. ఛర్ది, అన్నహితవు లేకుండుట, జ్వరము, తాపము, ఉడుకు, పైత్యము, గుండెలలో మంట మున్నగు బాధలను తగ్గించును.          తులము ౨—౦—౦

# సూర్యావర్తి

కేవల పైత్యవికారములను, వాతపైత్యములను తగ్గించుటలో ఇది పేరుపొందినది. ఛర్ది, ఎక్కిళ్ళు, దగ్గు, అగ్నిమాంద్యము, అరోచకము, ఆమ్లపిత్తము, శరీరము తిరుగుట, గుండెదడ, రక్తవాంతులు వగైరాలకును మంచిమందు.          తులము ౨—౦—౦

# క్రవ్యాదరసము

కడుపునొప్పి, కడుపుబ్బరము, ప్రేగులరచుట, దప్పిక, అతిసారము, బంకవిరేచనములు మున్నగు సకల అజీర్ణబాధలు పోగొట్టును. ఆకలి పెంచి జీర్ణశక్తి కలిగించును.          తులము ౧—౦—౦

గంధర్వఫార్మసీ—ఇన్నిస్‌పేట, రాజమండ్రి

| నాళం కృష్ణారావుగారివి | రు. | అ. |
| --- | --- | --- |
| తేనెచినుకులు | ౦ | ౮ |
| పాలతరగలు | ౦ | ౮ |
| గోగీతము | ౦ | ౨ |
| పైడితడి | ౦ | ౨ |
| ముద్దు | ౦ | ౪ |
| **పూజాపుష్పమాలవారివి** | | |
| చాకిరేవు | ౦ | ౮ |
| బాష్పబిందువు | ౦ | ౮ |
| **రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారివి** | | |
| వ్యాససంగ్రహం | ౨ | ౮ |
| గద్యచింతామణి | ౧ | ౮ |
| బాలకవిశరణ్యము | ౧ | ౮ |
| వ్యాసావళి | ౧ | ౦ |
| ఆంధ్రకవిభిషక్కుల భాషాభేషజము | ౧ | ౦ |
| **వ్యాసకుటీరంవారివి** | | |
| జన్మభూమి నాటిక | ౦ | ౪ |
| ప్రేమాంజలి—పంచమదంపతుల చరిత్ర | ౦ | ౫ |
| శుభోదయము | ౦ | ౩ |
| శ్రీ వివేకానంద సందేశము | ౦ | ౨ |
| సుగుణాకరము | ౦ | ౧౪ |
| తూలిక | ౦ | ౧౦ |
| ఆత్మజ్యోతి | ౦ | ౮ |
| సంధ్య | ౦ | ౬ |

| ఉన్నవ లక్ష్మీనారాయణగారివి | | |
| --- | --- | --- |
| నాయకురాలు | ౧ | ౦ |
| సంగీతసాపసాని | ౦ | ౧ |
| సోది | ౦ | ౧ |
| భావతరంగాలు | ౦ | ౧ |
| హరిజన నాటకము | ౦ | ౧ |
| **మారేమండ రామారావుగారివి** | | |
| భారతీయ విద్యాచరిత్రము | ౦ | ౧౨ |
| **భావరాజు వేంకటకృష్ణారావుగారివి** | | |
| విదేశయాత్రికులు—ప్రాచీనాంధ్రదేశము | ౧ | ౪ |
| **కవితాసమితివారివి** | | |
| వైశాఖి—వార్షికసంచిక | ౧ | ౦ |
| ఉత్కళపతనము నాటకం | ౦ | ౧౨ |
| ప్రభవ—ఖండకావ్యాలు | ౦ | ౮ |
| మాతృపూజ పద్యఖండాలు | ౦ | ౪ |
| **స్థానాపతి రుక్మిణమ్మగారివి** | | |
| పూలమాల—ఖండకావ్యాలు | ౦ | ౪ |
| **ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారివి** | | |
| వ్యాసావళి | ౦ | ౪ |
| **కూచి నరసింహంగారివి** | | |
| ఆత్మసంయమము—అమితవిషయాసక్తి | ౦ | ౬ |
| అనుబంధము | ౦ | ౩ |
| **టేకుమళ్ల కామేశ్వరరావుగారివి** | | |
| కలువలు | ౦ | ౪ |
| పాతపాటలు | ౦ | ౨ |

## కలాభివర్ధనీపరిషత్తు—ఇన్నిస్‌పేట—రాజమండ్రి

## వైక్రాంతభస్మము

కఫవ్యాధులలో చాల పనిచేయును. శ్లేష్మముడుకు, మూత్రకృచ్ఛ్రములు తగ్గించును. వీర్యవృద్ధి, తేజస్సు కలిగించును. అనుపానభేదములతో అనేక గుణములు కలిగించును. తులము ౧—౦—౦

## అయస్కాంతభస్మము

ఉబ్బు (నంజు) పాండువు, క్షయ, శ్వాసకాసలు, త్రిమ్మెరలు తగ్గించును. రక్తశుద్ధి చేయుటలో చాల శక్తి కలది. బలము, కాంతి, వర్చస్సు, నరములకు బిగి కలిగించును. తులము ౨—౦—౦

## అభ్రకభస్మము

ఇది శరీరదార్ఢ్యము, వీర్యవృద్ధి, బుద్ధిసూక్ష్మత కలిగించును. క్షయ, ప్రమేహములు హరించును. మధుమేహమునకు ప్రత్యేకౌషధము. నిస్సత్తువ, తాపము తగ్గించును. అనుపానభేదములతో అనేక రోగములకు వాడవచ్చును. తులము ౨—౦—౦

## లోహభస్మము

రక్తవృద్ధి, బలము, తేజస్సు కలిగించును. ఉబ్బు (నంజు) పాండువు త్రిమ్మెరలు, శూల, అజీర్ణము గుల్మవ్యాధులు తగ్గించును. అనుపానభేదములతో అనేక రోగములమీద వాడవచ్చును.

తులము ౩—౦—౦

గంధర్వఫార్మసీ—ఇన్నిస్‌పేట—రాజమండ్రి

# గంధర్వకళ

## రక్తపుష్టి, వీర్యవృద్ధి, నరములకు బిగి కలిగించు తియ్యని లేహ్యము

**అనేకులకు మఱల మగతనము కలిగించి పేరుపొందినది**

గంధర్వకళ—యౌవనము సంఘటించును. శుక్లనష్టము కట్టును. పుంస్త్వము పెంపుచేయును. కామోద్రేకము కలిగించును. సంభోగశక్తి హెచ్చుచేయును. మనోల్లాసము కూర్చును. ఆనందము కలిగించును. ప్రమేహములను జయించును.

కీళ్ళనొప్పులు, దురదలు, తిమ్మెరలు, పోనాడుటలో గంధర్వకళ ప్రత్యేకశక్తికలది. నవామేహములమీద ఇది చేయు పని అసాధారణమైనది. దీనిని ఎప్పుడును సేవించుచుండినచో ముసలితనము కనబడదు. ఏ వ్యాధులును చేరవు. ఇది బాలెంతరాండ్రకును చాల మేలుచేయును. వారి శరీరములకు పూర్వపుబిగి కలిగించును.

పౌను రు ౩—౦—౦

# మలయచందనము

## సెగరోగమునకు పేరుపొందిన ఔషధము

**పోటీలలో నెగ్గినది. నకళ్ళను చూచి మోసపోకుడు!**

ఈ క్రూరవ్యాధివలన బాధపడువారికి మా మలయచందనము నాలుగువందల యేండ్లనుండి గురుపరంపరగా వాడబడుచున్నది. ఇది సంస్థానములయందును రాజకుటుంబములయందును వాడుటకు కనిపెట్టబడినది. కావు ననే పథ్యము లేదు. పిచికారీతో పనిలేదు. సెగరోగము తగిలినట్లు, మందు పుచ్చుకొనుచున్నట్లు యెవరికి తెలియగూడదంటే మా మలయచందన మొక్కటే అందుకు తగినది. నకళ్లు బయలుదేరుచున్నవి. పరిశీలించకుండ ఏ యౌషధమును పుచ్చుకోవద్దు. గంధర్వఫార్మసీవారి మలయచందనమే కావలె నని కోరుడు. అనేక వైద్యులు సొంతమందులను విడిచి దీనిని వాడి విజయము, బహుమతులు పొందుచున్నారు. మూడుపూటలలో గుణమిచ్చును. ఎరుపు, తెలుపు, పచ్చసెగలకు ఇది రామబాణము. రస విష గంధకములు చేరని మూలికాయోగము. ఇక్కడకు అక్కడకు వరుగెత్తక నేడే మాకు వ్రాయుడు.

డబ్బీ ౧—౮—౦ దీని అనుపానము చందనతైలము ఔన్సు ౩—౦—౦ రెండును ఖర్చులతో ౫—౦—౦.

# నాగరఖండము

అజీర్ణములకు శూలలకు, పరిణామశూలకు చాల మంచిది. ఆకలిలేకపోవుట, కడుపుఉబ్బరము, నొప్పి, నోట నీళ్లూరుట, కడుపులో మంట, పొత్తికడుపులో పోటు, కండ్లమంట, ఓకరింత, వాంతులు, పుల్లత్రేనుపులు, భస్మక, అరుచి—వీటిని త్వరగా తగ్గించును. విడువకుండ ఒక్కపౌను సేవించినచో ఎట్టి గురుపదార్థమైనను సులభముగా జీర్ణమై, మరల ఆకలి కరకరలాడును. రక్తపుష్టి కలిగించును. పౌను రు ౨—౦—౦.

**గంధర్వఫార్మసీ—ఇన్నిస్‌పేట, రాజమండ్రి**

# ఆధునికాంధ్ర వాఙ్మయము

మా వద్ద నవీనకవుల గ్రంథాలన్నీ దొరుకును. వొక రూపాయకు తక్కువ ఖరీదు గల పుస్తకాలు వీ. పీ. గా పంపము. పోస్టుఖర్చులు కొనువారే భరించాలి.

| శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి | రు. | అ. |
|---|---|---|
| వీరపూజ—చరిత్ర | ౦ | ౧౨ |
| రక్షాబంధనము—డిటెక్టివునవల | ౧ | ౦ |
| శ్మశానవాటిక—డిటెక్టివునవల | ౦ | ౧౨ |
| మిథునానురాగము—చారిత్రికనవల | ౧ | ౦ |
| అనాథబాలిక—సాంసారికనవల | ౦ | ౬ |
| వారకాంత—నాటకము | ౦ | ౧౨ |
| విజయనగరరాజులకథలు | ౦ | ౨ |
| చిత్తూరురాజులకథలు | ౦ | ౩ |
| ఢిల్లీచక్రవర్తులకథలు | ౦ | ౩ |
| గోల్కొండనవాబులకథలు | ౦ | ౨ |
| శృంఖల—విమర్శగ్రంథము | ౦ | ౧౨ |
| **డా. చిలుకూరి నారాయణరావుగారివి** | | |
| జర్మనీదేశపువిద్యావిధానము | ౧ | ౦ |
| అంబ—లేక పొండిశిఖండి—నాటకము | ౧ | ౪ |
| సంస్కృతలోకోక్తులు | ౧ | ౦ |
| అశ్వత్థామ—అచ్చి—౨ నాటకాలు | ౦ | ౧౨ |
| అశోకుని ధర్మశాసనములు | ౨ | ౧ |
| ఉమార్ ఖయ్యామ్—రుబాయత్ | ౦ | ౯ |
| ఉపనిషత్తులు | ౦ | ౬ |
| **చింతా దీక్షితులుగారివి** | | |
| శబరి—కొత్తనాటకము | ౧ | ౦ |
| ఏకాదశి—౧౧ చిన్నకథలు | ౦ | ౧౨ |
| పరిణామవాదము—తన్నిదర్శనములు | ౦ | ౧౨ |
| **గుడిపాటి వేంకటాచలంగారివి** | | |
| మాకర్మమిట్లాకాలింది | ౦ | ౧౨ |
| బిడ్డలశిక్షణ | ౦ | ౮ |
| **నోరి నరసింహశాస్త్రిగారివి** | | |
| గీతమాలిక | ౦ | ౧౨ |
| సోమనాథ విజయము | ౦ | ౧౨ |
| భాగవతావతరణము | ౦ | ౮ |

| జనమంచి వేంకటరామయ్యగారివి | రు. | అ. |
|---|---|---|
| నవకుసుమాంజలి—ఖండకావ్యసంపుటి | ౧ | ౪ |
| మాలతీమాధవము—నాటకము | ౦ | ౧౨ |
| రాజశేఖరునివిద్ధసాలభంజిక. నాటకము | ౦ | ౪ |
| **శ్రీపాద కామేశ్వరరావుగారివి** | | |
| చంద్రగుప్త నాటకము | ౧ | ౪ |
| భారతరమణి డిటో | ౧ | ౦ |
| రాణాప్రతాపసింహ డిటో | ౧ | ౪ |
| శివాజీశీలము డిటో | ౧ | ౦ |
| లీలావతీసులోచనలు డిటో | ౧ | ౦ |
| బిల్వమంగళ డిటో | ౧ | ౦ |
| శ్రీమాధవాచార్యవిద్యారణ్య డిటో | ౧ | ౦ |
| చిత్తవృత్తి డిటో | ౧ | ౦ |
| ఒకపెగ్గు డిటో | ౧ | ౦ |
| పునర్వివాహము డిటో | ౧ | ౦ |
| తగినశాస్తి డిటో | ౧ | ౦ |
| సంభాజీనిర్యాణము డిటో | ౧ | ౦ |
| కళాపాహాడ్ డిటో | ౧ | ౦ |
| సాహిత్యమీమాంస—విమర్శగ్రంథము | ౧ | ౮ |
| నాటకవిమర్శ డిటో | ౨ | ౦ |
| కొత్తల్లుడు ప్రహసనము | ౦ | ౪ |
| పిపీనిగొట్టు డిటో | ౦ | ౪ |
| జగన్నాథమాహాత్మ్యము—ప్రబంధము | ౦ | ౧౨ |
| **బరంపురం కళాప్రచారక సమితివారివి** | | |
| రాయబారము—మొదటిసంపుటము | ౧ | ౦ |
| తేనెపట్టు—ఖండకావ్యములసంపుటి | ౦ | ౮ |
| **పూలతోటగ్రంథమాలవారివి** | | |
| వేయిసంభాలగుడి శాసనము | ౨ | ౦ |
| మల్లికార్జునరావు. స్వాంఘికనవల | ౦ | ౧౦ |
| **మల్లంపల్లి సోమశేఖరశర్మగారివి** | | |
| అమరావతీస్తూపము | ౦ | ౧౨ |

వలయువారు. కళాభివర్ధని పరిషత్తు. కలబరగి వారి యింట్లో, ఇన్నిసుపేట రాజమండ్రి అని రాసికోవాలి

రాజమహేంద్రవరం: శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితమై,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. ౯౧౫౧—౧౯౩౫